# మీ పిల్లలకు దగ్గుగాని రొంపగాని వచ్చినప్పుడు

## నిజమైన స్వస్థత చేకూర్చుటకు







# సిరోలిన్ 'రోష్' ఇవ్వండి




మీ పిల్లలయొక్క దగ్గును రొంపను ఉపేక్షించకండి. శీఘ్రముగా నిరపాయముగా నిజమైన స్వస్థత చేకూర్చే సిరోలిన్ ఇవ్వండి. అది చాలా సౌమ్యముగా పనిచేయును. మీ బిడ్డలు దాని రుచికి యిష్టపడుదురు. సిరోలిన్ మీకు కూడ ఎంతో మంచిది. అది దగ్గును ఆపడమే కాకుండా దగ్గుకు మూలకారణమగు హానికరమైన సూక్ష్మ క్రిములను నశింపచేయును. సిరోలిన్ గొంతు నొప్పిని ఉపశమింపచేయును. కఫమును నుసను పోగొట్టును, ఎంత బాధాకరమైన దగ్గునైనను శీఘ్రముగా పోగొట్టి స్వస్థత కలుగజేయును.

## మీ గృహమందు సిరోలిన్ తప్పక ఉంచుకొనండి

'రోష్' తయారు

సోల్ డిస్ట్రిబ్యూటర్సు:, వాల్టాస్ లిమిటెడ్

WAT.VT 2399

# ఉత్తరాలు

## ముఖచిత్రం

నా అభిమాన నటుడు "రామారావు" ముఖచిత్రం ముచ్చట గొలిపేటట్లుంది.

ఆరిసెట్టి వెంకటరావు (విశాఖపట్నం)

*　*　*

సినీనటుడు నందమూరి తారక రామారావు ముఖచిత్రం విగ్రహపుష్టి కలిగి, నయనానందముగ నున్నది.

ముత్యాల చలపతి (అనంతపురం)

## కథలు

'మనోవల్మీకం'—అన్నదే సరియైనది. నా వ్రాత ప్రతిలో నేను పై విధంగానే ఉదహరించాను. 'మనో వాల్మీకం' గా ప్రచురింపబడటం రచయిత (నా) పొరపాటు కాదు.

కె. వివేకానందమూర్తి (విశాఖపట్నం)

*　*　*

"టు రైట్ ఈజ్ మై రైట్" నన్ను కడుపుబ్బా నవ్వించింది. అంతా చదివాక, కడుపు చేతో పట్టుకున్నానంటే నమ్మండి. కాని కథలో చిన్న పొరపాటు. "రమణ", "ఆనంద్" కు 'మీరు' అంటూ బహువచన ప్రయోగం చేస్తూ ఉత్తరం వ్రాస్తాడు. కాని, అతను "అనూరాధ" ఇంటికి వచ్చినపుడు "ఆనంద్" అంటూ ఏకవచన ప్రయోగము చేస్తాడు. ఇలా కాక, కథలో ఇంకొంచెం మార్పు తెచ్చి మరికాస్త సస్పెన్సు ఉండిఉంటే చాలా 'వండ్రఫుల్'గా ఉండేది. రచయితకూ, మీకూ నా ధన్యవాదములు.

ఎమ్. లక్ష్మణరావు (జెంపిం నగరం)

*　*　*

గోడమీద బొమ్మ చాల బాగుంది అరుణకు నా అభివందనములు.

15—3—63 పత్రికలో ఒక్కకథకూడ బాగు లేదు యికనించి మంచి కథలు ప్రచురించ కోర్తాను. నాలుగు ఉత్తికధలు 2 సీరియల్ వేస్తె బాగుంటుంది ఏదీ పత్రికలో జవాబు ఇవ్వండి.

డి. ఉదయలక్ష్మి, డి. శాంతకుమారి.

## తెరమీద - తెర వెనుక

పత్రికలో 'తెరమీద—తెర వెనుక' శీర్షిక మమ్ములను చాల నిరుత్సాహ పరచినది. మీరు నాగేశ్వరరావుగారిని ఎందుల కిలా పొగడుతున్నారో అర్థం కావడంలేదు. నాగేశ్వరరావుగారిని ఇదివరకు మీ పత్రిక ద్వారా, చాలసార్లు (అట్టమీద బొమ్మ, బాపూగారి కార్టూన్ల ద్వారా, ఇంకా అనేక రకాలుగా) మాకు పరిచయం చేసి ఆయన జీవితం గురించి వినిపించారు. అటువంటప్పుడు మీరు ఇంకా ఆయన్ని అనేక శీర్షికల-ద్వారా పరిచయం చేయడంలో అర్థంలేదు. ఐనా మీ పత్రికలో రోజురోజుకు సినిమా శీర్షికలే ఎక్కువై పోతున్నాయి. మీరు దేశంలో ఇంకా గొప్పవారి నెవరినైనా క్రొత్త వ్యక్తులను (అంటే ఇదివరకు మీ పత్రిక ద్వారా పరిచయం చేయనివార్ని) పరిచయం చేస్తే, ఆనందిస్తాము. ఎప్పుడూ పత్రిక పురోభివృద్ధి కోరే........

ఎమ్. ఎన్. రావ్, ఎ. ఎన్. రావ్ (భువనేశ్వర్)

*　*　*

జమునను పరిచయము చేసినందుకు చాలా ఆనందించినాను. కుమారి జమున పరిచయముతో ముఖచిత్రము జమునది అయిన మీ ఆంధ్ర వారపత్రికకు నన్నే తెప్పున్నా

నా అభిమాన తార కుమారి కృష్ణకుమారిని కూడా పరిచయము చేయకోరెదను.

రమణి (హైదరాబాదు)

*　*　*

"మా పతితలలో ఒకరు" అని ప్రచురించిన ఫోటోలో జమున చదువుతున్నది 1—2—63 తేదీ ఆంధ్ర సచిత్ర వారపత్రికేనా ?

స్త్రీ శ్రీ (పార్వతీపురం)

**ఆంధ్ర సచిత్ర వారపత్రికేనని తెలుస్తున్నది.**

*　*　*

'తెరమీద తెరవెనుక' లో అక్కినేని గురించి కంటే జమున గురించి వాస్తవంగా రాశారు. ఐతే ఆమె 'కీర్తికి' కలిగిన ఆటంకాలను మాత్రం రచయిత ఎక్కువగా పేర్కొనలేదు. అదివారి హుందాతనాన్ని సూచించింది.

రాజేశ్వరి (నగరి)

*　*　*

చిన్నతనంలోనే తెలుగు చిత్రసీమలో ప్రముఖ నటిగా పేరుగాంచి, ఈ మధ్యనే హిందీ రంగంలో కూడా అడుగుపెట్టిన గ్లామరస్, టాలెంటెడ్ ఏక్ట్రెస్ జమునతో ఇంటర్వ్యూ ఇంత త్వరలో ప్రచురించడం హర్షించదగిన విషయం. ఉత్తరాదిన బ్రహ్మాండంగా ప్రదర్శించబడుచున్న 'హం రాహి' ఈమె అద్భుత నటనకు, హిందీ రంగంలో కూడా మంచిస్థానం సంపాదించుకొన్న దనటానికి తార్కాణం. రాబోవు చిత్రాలలో కూడా మంచి నటనను ప్రదర్శించి హిందీ రంగంలోకూడా అత్యుత్తమ స్థానాన్ని అలంకరిస్తుందని తలుస్తున్నాను.

సర్వ భాస్కరరావు (ఖమ్మంమెట్టు)

## సందేహము

"జపాన్ లేఖ" చదివితిని. నాకు అతనికి ఉత్తరము వ్రాయవలెనని ఉన్నది. కాని, ఏ భాషలో వ్రాయవలెనో తెలియలేదు. అతను మీకు ఏభాషలో వ్రాసినాడో తెలియజేసినయెడల నేను కూడా ఆ భాషలో వ్రాసెదను.

ఇంకా, ఆతని అడ్రసు దయచేసి ఇంగ్లీషులో ప్రచురించవలెను. తెలుగులో ఉన్న ఆ ఎడ్రసు ఇంగ్లీషులో నేను మార్చిన "స్పెల్లింగ్" తప్పులు ఉండును. అందుచే దయచేసి మీరు అతని ఎడ్రసు ఇంగ్లీషులో ప్రచురించి, అతను మీకు ఏ భాషలో ఉత్తరము వ్రాసినాడో తెలుపవలసినదిగా (పత్రికా ముఖముగా) ప్రార్థించుచున్నాను.

రవికుమార్ (ఏలూరు)

**ఉత్తరం ఇంగ్లీషులోనే వ్రాయండి. అడ్రసు క్రింద ఇస్తున్నాము.**

Masayuki Miyake
849–2, Hara Yamaoka–Cho
Ena-Gun Gihu–Ken
**JAPAN**

## మరువలేని మనిషి

హిందీ చలనచిత్ర రంగానికి వన్నె తెచ్చిన ప్రఖ్యాత హిందీ—తార సాధనగారు వ్రాసిన వ్యాసం నన్ను బాగా ఆకర్షించింది. మరువలేని మనిషి ద్వారా, మమ్మలని ఆనంద తరంగాలలో ముంచుతున్నారు. ఈ వ్యాసం మన పత్రికకు ఒక చక్కని కథ లాంటిది.

ఎ. నగేష్ (కాకినాడ)

*　*　*

సుప్రసిద్ధ సినీ తార సాధనా శివదాసానిగారి 'మరువలేని మనిషి' వ్యాసం చాలా బాగుంది. ఆమెకు గల 'మాతృ ప్రేమను' ఆధారముగా తీసికొని పాఠక లోకానికి తన చిన్ననాటి సంఘటనలను క్లుప్తంగా వివరించారు. ఆమె నా 'అభిమాన' నటి. పత్రికలో ప్రచురించిన ఫోటో నాకు పంపించారు కూడా !

రావుల శ్రీరామచంద్రమూర్తి (నరేంద్రపురం)

## రాజధాని కబుర్లు

ఆంధ్ర నాటక రంగం గురించి శ్రీ ప. ఎల్. ఎన్. గారు వ్రాసిన రెండు వ్యాసాలు చాలా చక్కగా ఉన్నాయి. చాలావరకు రాజకీయాలనే "రాజధాని కబుర్లు"లో చదువుతూ వచ్చిన మాకు ఈ రెండు వ్యాసాలు కొంత సరదా ఇచ్చాయి. కానీ— ఎటూ ఆంధ్రనాటక కళాపరిషత్తు పోటీల గురించి వ్రాశారు కాబట్టి పోటీలో పాల్గొన్న అన్ని నాటక నాటికలను కూడా (మొత్తం పదిహేనే కాబట్టి) సంక్షిప్తంగా సమీక్షించిఉంటే అటు ప్రదర్శించిన సమాజాలవారికీ, చూచిన ప్రేక్షకులకు— ఇటు ఇక మీదట వాటిని ప్రదర్శించాలనుకుంటున్న (మాలాంటి) వారికీ ఎంతో ఉపయోగకరంగా ఉండేది.

యస్. యం. భాషా. (తెరువలి; ఒరిస్సా)

## హమేషా తమాషా

ఆంధ్రవారపత్రిక కొనగానే, ప్రథమంగా నేను చదివేది తమాషాయైన శీర్షిక "హమేషా—తమాషా". ఈ శీర్షికద్వారా పాఠకులకు హమేషా తమాషా కల్గిస్తున్నారు. కాని, ఒకటో, అరో పేజీ వేస్తూ మీరు ఈ శీర్షికకు "హమేషా—అన్యాయం" చేస్తున్నారు. దీనివలన నాలాంటి చాలా మంది పాఠకులు "హమేషా— నిరాశ" చెందుతున్నారనే విషయం, "హమేషా— సత్యం" కనుక ఇకనుంచయినా రెండు పేజీలు వేసి ఈ శీర్షిక ద్వారా పాఠకులకు "హమేషా— ఆనందం" అందించమని మనవి.

సనీమారి (కర్నూలు)

★

# ఆంధ్రసచిత్రవార పత్రిక

వ్యవస్థాపకులు
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం : 22—3—63
శుభకృన్నామ సం॥ ఫాల్గుణ మాసం॥ బ॥ ద్వాదశి
సంపుటము : 55 సంచిక : 29
స్థాపితము :
1908
*
ముఖ్య సంపాదకులు
శివలెంక శంభుప్రసాద్

సంపాదకులు :
శివలెంక రాధాకృష్ణ
*
ఒక సంవత్సరం చందా
వివరాలు

ఇండియా : రూ. 13.00 ఇతర దేశాలు: ఓడమీద Sea Mail రూ. 20.00 (విమానం ద్వారా Air Mail బ్రిటన్ జర్మనీ, ఇతర యూరోప్, ఆఫ్రికా దేశాలు— రూ. 114.00. అమెరికా రూ. 176.50. ఆస్ట్రేలియా 135.00.)
*
విడిప్రతి : 25 న.పై.
సంవత్సర చందా : 13-0-0.
*
ఆంధ్రపత్రిక కార్యాలయము
7. తంబుచెట్టి వీధి, మద్రాసు-1





వర్తమాన తార 'దేవిక' (ప్రభాకర్.)

## మనలోమాట

ఈవారం 'రూప విచిత్రం' కూడా కొంచెం దూరంనుంచి చూస్తేనే బాగా 'కనిపిస్తుంది.' గీతల చాటున 'చుక్క' ఎవరో చెప్పనక్కరలేదనుకుంటున్నాము!

* * *

వచ్చేవారం ఆంధ్ర సచిత్ర వార పత్రిక ఉగాది ప్రత్యేక సంచికగా వెలువడుతుంది 'తెరమీద — తెర వెనుక' శీర్షిక వెయ్యడం లేదు... కాని. ఇతర ఆకర్షణల వివరాలు ఈ పత్రిక 56 వ పేజీలో ప్రకటించాము.

* * *

రచనలు ఏ ఎడ్రస్‌కి పంపాలంటూ కొందరు వ్రాస్తూ ఉంటారు. అన్నీ 'సంపాదకుడు' ఆంధ్ర సచిత్ర వార పత్రిక, 7, తంబుచెట్టివీధి, మద్రాస్-1కి పంపాలి

హమేషా—తమాషా, కథకానికథ, వనితాలోకం, వనితావాణి రచనలు కవర్‌లలో పంపినట్లయితే కవర్‌ల మీద 'ఫలానా శీర్షికకు' అని స్పష్టంగా వ్రాయాలి.

రచయి(త్రు)తల చిరునామాలు తెలుపటానికి వీలుకాదు. అలాగే సినిమా వ్యక్తుల చిరునామాలు కూడా తెలుపటానికి సాధ్యం కాదు.

* * *

వచ్చేవారం నా అనుభవంలో కెల్లా పెద్ద పరిశోధన వ్యాసం రచయిత రోమ్ (ఇటలీ)పోలీసు అధికారి శ్రీ దోసీ. వ్యాసం పేరు 'ముక్కలుగా వచ్చిన స్త్రీ'.

## లోకంపోకడ



"నిజంగా మన దేశం ఆధ్యాత్మిక స్థాయిలో పెరుగుతోందనుమా! త్రాగుడు లేదు కదా! సిగెరెట్లూ... అవ్వే లాభం లేదు... యిక వుపవాసాలు కూడా బలవంతంగా చేయిస్తారేమో దాంతో ఋషుల దేశం అవుతుంది మరి..."

# విషయానుక్రమణిక


కథలు :

భ్రష్టయోగి — 12
ఆశాజ్యోతి — 17
శుభలేఖ — 20

సీరియల్ కథ:

శ్రీదేవి — 22

శీర్షికలు, వ్యాసం, సినిమా :

ఉత్తరాలు—3; ఊమెన్ కార్టూన్—6; న్యూఢిల్లీలేఖ — 7; రాజధాని కబుర్లు—9; మనమూ - మనదేహస్థితీ—11; పరుసలూ...వయస్సూ (వ్యాసం)—13; వనితావాణి—14; వంటలు — 15; హమేషా — తమాషా-19; గులాబి (గేయం)—21; వారఫలాలు — 24; సారాసీసా (నా అనుభవంలోకెల్లా పెద్ద పరిశోధన)—27; గీతల చాటున దాగినచుక్క (ప్రత్యేక ఆకర్షణ)—28; పరాగపరాల— 30; తెరమీద—తెరవెనుక-32; చదువుల్రావు— 35; అవీ-ఇవీ-అన్నీ—52; పొట్టికథలు—56.



పట్టణఖాళీ స్థలాలమైపన్ను
మోశారా! మీమీద సుంకాలు వేశానిదివరకు ఇప్పుడు వాళ్ళమీద వేస్తున్నా. న్యాయమూర్తినిగదూ!
పట్టణ వాసులు
గ్రామవాసులు




భారత్ నేపాల్ల మైత్రీ భావం
ఆయన నకుళ్ళాయి కదోత్తురాయి?




జానయ్యా! ఏమంటావ్? నేను నీ వేలు మీద
చైనా రష్యా భూభాగం మీద కూడా కన్నేసింది




రష్యాలో సృజనాత్మక రచన
కృశ్చేవ్ ఉవాచ: "రష్యా రచయితలంతా పార్టీ నిర్మాణాత్మకంగానే రాసితీరాలి"

శ్రీకృష్ణ

# అపర విశ్వామిత్ర సృష్టిగామారిన కేంద్ర బడ్జెట్!

మన కాంగ్రెస్ ప్రభుత్వ నాయకులు భారత దేశం ముఖాన పడేసిన బడ్జెటు లన్నిటిలోకి ఈ యేటి బడ్జెటు అతి దారుణమైంది, నిస్సారమైంది, నిరుత్సాహకరమైనదీ, అసహజమైందీ కూడా. అసహజ మనటానికి కారణమేమిటంటే, ఈ కొత్తపన్నులువల్ల మధ్యతరగతి వాళ్ళమీద, వ్యవసాయ దార్లమీద ఎలాంటి ప్రభావాన్ని కలిగిస్తుందో ఆ విషయాన్ని బడ్జెట్— సృష్టికర్తలు మర్చిపోయారు. అసహజమంటానికి ఇంకో కారణంకూడా ఉంది. నిర్బంధ పొదుపుపథకాన్ని అమలు జరపడంలో గల పరిపాలనాత్మకమైన ఇబ్బందులను ఈ "విశ్వామిత్రులు" సరిగా అంచనా కట్టలేకపోయారు. ప్రజలను పన్నులద్వారా రోజురోజుకు జోలె చేతికిస్తుందన్న విషయాన్ని మరిచి, తయారైన బడ్జెటు కనుక ఇది అతిదారుణమైంది.

ఇలాచెప్తే మీకు అర్థంకాక పోవచ్చు. కొంచం వివరంగా ఈ సమస్యని ఆలోచిద్దాం. మంత్రులకు వాళ్ళువాడే విద్యుచ్ఛక్తి బిల్లును నెలసరి రు. 1000 నుంచి రు 250 కి తగ్గించుకోమంటే ఏ సేమిరా వీల్లేదు అన్నారు. అలాంటప్పుడు తన మంత్రుల్నే ఒప్పించ లేనిప్రభుత్వానికి 'మీరంతా మహామహాత్యాగాలు చెయ్యా'లని సామాన్య ప్రజలకు చెప్పే హక్కు ఎక్కడుంది? మంత్రుల ఆదాయాలమీద అంటే వారి వేతనాలమీదకూడా పన్ను వేస్తున్నారంకదా అనవచ్చు. ఒక్కజీతం మినహాయించి తదితరమైనవన్నీ వాళ్ళకు ఉచితంగానే లభిస్తాయి. ఉదాహరణకి ఒకవిషయాన్ని తీసుకుందాం. ఏదో ఓచిన్న బస్సు పెట్టుకుని పొట్టపోషించుకునే వాడికి ఈరోజున పెట్రోలుబిల్లు ఎంత అవుతోందో ప్రభుత్వపు కార్లలో తిరిగే ఈమంత్రులకు ఎలా అర్థమౌతుందీ? మహామహాభవనాల్లో నివసించే ఈప్రముఖులకు, కలో గంజో త్రాగి కడుపు నింపుకునే సాధారణ ప్రజలమీదకు సకుటుంబంగా దండయాత్ర జరుపుతూ, సామ్యవాద వ్యవస్థనుగూర్చి, త్యాగనిరతినిగూర్చి ఉపన్యాసాలుచేసే హక్కు ఎలా వుంటుంది ?

జనం సరిగా బ్రతకాలనుకుంటే ఈ అధిక పన్నులు చచ్చినట్టు భరించటం వినాగత్యంతర లేదని శ్రీ మొరార్జీదేశాయ్ అభిప్రాయం. బడ్జెట్ సమర్పించిన తర్వాత ప్రధానమంత్రి చైనీయులు మళ్ళీ దండెత్తి వచ్చునన్న మహాసత్యాన్ని వెలిబుచ్చారు. అసలు విషయమేటంటే ఒకరకమైన భీతి ప్రజల్లో కలిగించి వాళ్ళచేతిపన్నులను సమ్మతింపజేసే ప్రయత్నాలు జరుగుత్నాయి. పన్నులు పన్నులు వినాగత్యంతరం లేదనుకోటంలోనే శ్రీ శ్రీ దేశాయి పప్పులో కాలేశారు. లేకపోవటమేం! చాలా మార్గాలున్నాయి. మొట్టమొదటగా చేయ్యాల్సినపని. రక్షణకొరకు సంబంధించని ప్రణాళికా ధనంలో ఖర్చు తగ్గించుకోవటం. ఒక్కసారిగా సమాజ వికాసాభివృద్ధికి బురకామార్చటం మన ప్రధానమంత్రికి అదేదో ఇంద్రజాలంగా అని పిస్తుందేమో ! ఆ పేరుతోటి ప్రజల కష్టార్జితాన్ని దుబారాచేయుటంతప్ప వేరేంలేదు. రెండవది 1921లో రాష్ట్రాలకు బదలాయించిన వ్యవహారాల్లో కేంద్ర మంత్రులు చెయ్యిపెట్టటం మానుకోవాలి. ఏపుర పాలక సంఘమో నిర్వహించాల్సిన ప్రాథమిక విద్యలో జోక్యం కల్గించుకున్న ప్రభుత్వశాఖలుకూడా ఉన్నాయి. ఇహపోతే ప్రస్తుతం న్యూఢిల్లీ నగరం ఎప్పటిలాగే ప్రశాంతంగావున్నట్లు చూడంగానే తెలుస్తుంది ఉన్న అసాధారణస్థితి అల్లా కాగితాల మీద, పన్నులు విధింపులోనూ బ్రతికీవుంది మన బడ్జెటు ప్రతిపాదనలు ఎంత అసంతృప్తికి గురయ్యాయో, ఈ క్రింది పత్రికా రచనలుచూస్తే తెలుస్తుంది :

న్యూఢిల్లీ పత్రికలనీ శ్రీ దేశాయి ప్రతిపాదించిన బడ్జెటును, తీవ్రంగా విమర్శించాయి. ఈ బడ్జెటులో వున్న భారమైన పన్నులు దేశఆర్థిక విధానాన్ని ద్రవ్యోల్బణతకు దించే అవకాశాలున్నాయని అభిప్రాయాన్ని ప్రకటించాయి.

రూపాయి విలువకు శ్రీ దేశాయ్ 'చిత్రవధ' చేశారని విమర్శిస్తూ ఫ్రీ ప్రెస్‌జర్నల్ ఈ భారీ పన్నులవల్ల జీవనవ్యయం పెరిగి పోవటమేగాక నైతిక విలువలను నాశనంచేస్తుందని, అవక తవక ఉత్పత్తులు ఏర్పడతాయనీ విమర్శించింది.

ఆనందబజార్ పత్రిక అప్పుగా తెచ్చుకోవటం వల్లగాని లోటు బడ్జెటువల్లగాని ఇప్పటి బడ్జెటు కన్న, కొంతవరకు తేలికవటంగాని, సమానంగా పంపిణీగాని జరుగుదనుకోవటాని వీల్లేదనే వాదం అంతగా నమ్మతగ్గది కాదని అభిప్రాయ పడింది.

ఈ భారీపన్నులు, దేశఆర్థికశాఖ వృద్ధికి తీరూ అవాంతరం కల్గించే అవకాశంలున్నాయని హిందని స్థాన్ స్టాండర్డు ప్రభుత్వాన్ని హెచ్చరించింది.

ఏదో వో తీరని అవాంతరంవల్ల అకస్మికంగా ఏర్పడ్డ పరిస్థితులవల్ల ఈ భారీపన్నులు వేయాల్సి వచ్చిందని చెప్పటంలో శ్రీ దేశాయ్‌కి రాజకీయమైన ధైర్యంగాని, ధృఢ నిశ్చయంగాని లేదని 'ఇకనామిక్ టైమ్స్' విమర్శించింది.

ఇండియన్ ఎక్స్‌ప్రెస్, అధిక లాభాలపై అదనపు పన్ను అతిదారుణమైందనీ, దీనివల్ల మంచి అభివృద్ధిలోవున్న బ్యాంకింగ్ సంస్థలకు పెద్దపెద్ద దెబ్బతగలమేగాక, ఇంకెవరు ధైర్యంగా పెట్టుబడి పెట్టడానికి రారని, అందువల్ల అధిక లాభాలపై అదనపు పన్నును తీసివేయాలని దేశాయిని కోరింది.

పయొనీర్, ది లీడర్, ఇండియన్ నేషనల్ లాంటి రాష్ట్రీయమైన పత్రికలుకూడా, ఈబడ్జెట్ ప్రతిపాదనల్లోని భారీ అదనపు పన్నుల వల్ల, మధ్యతరగతి, తక్కువవేతనాల వారిపైన చాలా భారం పడటమేకాక పురోగతిని త్రిప్పికొడుతుందని విమర్శించాయి.

ఈ అవకతవక బడ్జెటువల్ల కాంగ్రెసు పార్టీ చాలా ఆందోళన చెందింది. ఉదాహరణకు

—51వ పేజీచూడండి



బంగారు కంట్రోలువల్ల నిరుద్యోగులైన ఆదోని స్వర్ణకారులు ఇటీవల ఊరేగింపుగా ఆర్. డి. ఓ. వద్దకు రాయబారం వెళ్లారు.

# 'మానవసేవాపరమావధికుడు బాబూరాజేంద్రప్రసాద్'

ఐ. ఎల్. ఎన్.

పుట్టుకతోనే కొంతమంది గొప్పవాళ్లయి పోతారు. కొంతమంది గొప్పతనాన్ని సాధిస్తారు. మరి కొంతమందిమీద అమాంతం గొప్పతనం వచ్చి పడుతుంది అంటూ, గొప్పతనానికి, వ్యక్తికి గల పరస్పర సంబంధాన్ని చిత్రంగా వర్ణించాడు ఓ కవి. అసలు మనం దేన్నైనా కావాలనుకుంటే, అది యెంతో దూరంగా వెళ్లిపోతున్నట్లు కనిపిస్తుంది. ఈ భావాన్నే యింకో రూపంలో సాక్షాత్కరింపజేయాలంటే, దొరకనిదానికోసం, వెయ్యి కళ్లు పెట్టుకుని ఎదురుచూస్తూ ఉంటాం అనచ్చేమో! అయితే కొంతమంది కృషిచేసి, కోరుకున్నదాన్ని పొంద కలుగుతూనే ఉన్నారు. వారు ధన్యజీవులు. కృషిచేసిన వారందరూ యీ విధంగానే సాధించగలుగుతారా అంటే అదీకాదు. తనకు రాబోయే పదవి, హోదా ముందుగా తెలుసుకోగలిగి, దానికోసమే యావచ్ఛక్తి వినియోగించి, పొంద కలుగుతున్నారా అంటే, అదీ కనిపించదు. మనస్సుకు నచ్చింది, నలుగురూ మెచ్చింది హృదయపూర్వకంగా విశ్వసించి, భోగభాగ్యాల్ని విడనాడి, జీవితాన్ని సేవకు అంకితం చేసి, సర్వస్వం త్యాగం చేయటానికి సంసిద్ధులై, విశ్వ-శ్రేయస్సుకు పాటుబడేవాళ్లు కొందరుంటారు. వాళ్లకు పదవులతో సంబంధంలేదు. ఏదో పొందాలని వ్యక్తిగతమైన ఆంకాక్ష లేదు. మానవసేవే, వాళ్ల పరమావధి. ఆ సేవ, ఏ కాలానికి ఏ రూపంలో వచ్చినా, చిరునవ్వుతో స్వీకరించి, విధ్యుక్త ధర్మంగా శాయశక్తులా నెరవేర్చుకుంటూ సునాయాసంగా, కాలవాహినిలో కలిసిపోతారు. ఇలాంటి కోవకు చెందిన గొప్ప దేశనాయకుడు డాక్టర్ రాజేంద్రప్రసాద్.

ఆ రోజుల్లో – అంటే 1920 ప్రాంతంలో మన దేశంలో జమీందారులు కొల్లలు కొల్లలుగా ఉంటూ ఉండేవారు. అజమాయిషీ లేని, ఎస్టేట్‌ను, విచ్చలవిడిగా ఖర్చుపెట్టేసి, రకరకాల దుర్వ్యసనాలకు అలవాటై, విద్యాగంధానికి, ఎంతో దూరంగా ఉంటూ, నలుగురి నోళ్లల్లో చెడ్డపేరు తెచ్చుకున్న ఖ్యాతి, జమీందారీ కుటుంబాల్లోనే ఎక్కువగా ఉన్నట్లు, బెంగాల్ ప్రఖ్యాత నవలా కారులు మనకు పరిచయం చేశారు. అలాంటి జమీందారీ కుటుంబంలో, కడసారి ఒడ్డగా పుట్టి, తల్లిదండ్రుల గారాబం—ఒరవడిలో కోసుకుపోకుండా నిలబడి, చిన్నప్పటినుంచే చదువుయందు, భక్తి శ్రద్ధలు కనపరుస్తూ, మొట్టమొదటి పరీక్షలోనే తన గొప్పతనంచేత నలుగుర్నీ చకితుల్ని చేసిన కీర్తి రాజేన్‌బాబుకే దక్కింది. కలకత్తా, పాట్నా, హైకోర్టులలో ప్లీడరుగా ప్రాక్టీసు చేస్తూ, విశేషమైన ధనార్జనతోపాటు, పేరు—పఖ్యాతులుకూడా సంపాదించుకున్నాడు. సంఘంలో ఎనలేని గౌరవాభిమానాలను పొందుతూ, లాయర్—వృత్తియొక్క ఉత్కృష్ట స్థానాన్ని, యింకొంచెం పై స్థాయికి తీసుకువెళ్లారు. హోదాలోనూ, ధనంలోనూ, నలుగురూ చూసి, అసూయపడే స్థానంలో ఉంటూ కూడా, అన్నీ విడనాడి, ఆనాటి ప్రముఖ నాయకుల మాదిరిగా, రాజేన్‌బాబు కూడా, స్వాతంత్ర్యోద్యమంలోకి దూకాడు. అప్పటినుంచీకూడా, ఆయన జీవిత-చరిత్ర దేశ-చరిత్రతో పెనవేసుకుంటూ వచ్చింది. భూకంపం వచ్చి, అపారమైన నష్టకష్టాల్లో ప్రజలు చిక్కుకునిపోయి అలమటిస్తుంటే, అక్కడ ప్రత్యక్షమై, ప్రజల్లో విశ్వాసాన్ని పురికొల్పుతూ, అపారమైన సేవ చేశాడు. చాంపరాన్ సత్యాగ్రహంలో ఈయన పాత్ర అసమానమైనది. ఇక దేశ స్వాతంత్రోద్యమంలో ప్రతిఘట్టంలో ఈయనమూర్తి ప్రత్యక్షమే! స్వతంత్రానంతరం, పదవుల పంపిణీ జరిగినప్పుడు, ఈయన కొన్నాళ్లు కేంద్ర ప్రభుత్వంలో పనిచేశాడు. తర్వాత ప్రప్రథమ రాష్ట్రపతిగా, భారత ప్రజలు రాజేన్‌బాబునే ఎన్నుకున్నారు.

దేశ—నాయకులు, స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొని, ప్రజలకు అత్యంత సన్నిహితులయిన వాళ్లు యింకా కొంతమంది లేకపోలేదు. అయితే ఈయన ప్రత్యేకత ఏమిటి? మనిషి నలుపైనా మనస్సు తెలుపు. అజాతశత్రువు; ఆధ్యాత్మికవాది. పండువెన్నెలలాంటి ఆయన నవ్వులో, మూర్తీభవించిన గాంధీజీ సూత్రాలు వికసిస్తూ ఉంటాయి. గంభీరమైన ఆయన వదనంలో గాంధీజీ—మూర్తి సాక్షాత్కరిస్తుంది. ఆయన మాటల్లో, మనస్సులో, చేతల్లో, గాంధీజీ—ప్రవచనాలే ప్రతిధ్వనిస్తూ ఉంటాయి. గాంధీజీ—తత్వం, ఆయనలో అంతగా జీర్ణించుకుని పోయింది. గాంధీజీకి వారసులమని, విర్రవీగే మహానాయకుల్లో లేని ప్రత్యేకత, ఈయనలో ఉన్నది యిదే! అందువలననే, దేశప్రజ, ఆయన్ను గొప్ప పెద్దమనిషిగా గౌరవించగలిగింది. ఆయన్ను అభిమానించటంలో పార్టీ, ప్రాంతీయ, కుల, మత విభేదాలు అడ్డురాకపోవటానికి యిదే కారణమేమో! ఒక మహాఋషి, తన తపోబలంచేత ఒక్కొక్క పదవి అలంకరిస్తూ, చివరకు ఇంద్ర పదవి పొందినట్లు ఈయనకూడా, తన సేవాబలంచేత ఒక్కొక్క మెట్టే ఎక్కుతూ, చివరకు ఢిల్లీలో రాష్ట్రపతి—సింహాసనం అలంకరించాడు.

'ఏక్ దిన్ హై తో జానా!....' అన్నట్లు, గాంధీజీ సిద్ధాంతాల ఆఖరి పట్టుకొమ్మ విరిగి నేలమీద పడింది. ఆయన భౌతిక దేహం అగ్నిజ్వాలలకు ఆహుతి అయిపోయింది. మానవుని మేధస్సుకు అందని చోటుకు, ఈ నేత్రద్వయం చూడలేని చోటుకు పయనమై వెళ్లిపోయాడు. ఇది ఏదో ఒకనాడు జరిగి తీరాల్సిందే! దాదాపు ఎనభైఏళ్లు భూదేవిని అంటిపెట్టుకుని ఉంటూ, చివరకు ఆమెలోనే లీనమయిపోయాడు. తన రాకచేత, దేశాన్ని, ప్రజల్ని పునీతం చేసి, స్థిరంగా ప్రజల మనస్సుల్లో నిలిచిపోయాడు. మార్చి ఒకటవ తేదీన తెలతెలవారుతుండగానే, ఈ వార్త వచ్చిపడింది. రాజధాని నగరమంతా తెల్లబోయింది. ఎక్కడో దూరాన ఉంటూ, ఆయన పేరు—ప్రతిష్ఠలు వింటూ

49-వ పేజీ చూడండి

# మనము - మన దేహస్థితి

డా॥ గాలి బాలసుందరరావు

## జఠరాశయ వ్రణములు: ఆహారము

ఆహార పదార్థములు అనేక దేశాలలో అనేక విధములుగా ఉంటవి. జఠరాశయ వ్రణములు వివిధ దశల్లో వున్నప్పుడు, ఆహారం వివిధములుగా ఉంటుంది. కాని ప్రారంభదశలో, అన్నిదేశముల లోనూ, క్షీరాహారమునే అనుభవజ్ఞులయిన వైద్యులు ఆదేశిస్తారు. ఒక్కొక్క నిపుణుడు, రోగి పరిస్థితినిబట్టి ఒక్కొక్క రకమయిన ఆహార పథకమును తయారుచేస్తాడు. ఆధునిక కాలములో పాలతోబాటు పుష్టికరమైన ఆహారము లెన్నో మార్కెట్‌లో లభిస్తున్నవి.

అల్సర్లు తీవ్రస్థితిలో ఉన్నప్పుడు, చాలా తేలికగా జీర్ణమయ్యేది, కిట్టిపదార్థము అధికంగా లేనిదీ, మసాలా ద్రవ్యములు లేనిదీ అయిన ఆహారము యివ్వవలసి ఉంటుందని యిదివరకే తెలుసుకున్నాము.

అన్ని దేశములలోనూ, అన్ని కాలములలోనూ లభించే వస్తువులతో సులువుగా తయారుచేయగల పథకమును శాస్త్రజ్ఞులు తయారు చేశారు,

ప్రతిఒక గంటకు ఒకసారి ఆహారం తీసుకోడం, అల్సరు తీవ్రస్థితిలో ఉన్నప్పుడు చాలాఅవసరం నిద్రాకాలంలో ఆహారం అవసరములనూ, నొప్పిని బట్టి ఉంటుంది. మొదటి ఆహారంగా 5 ఔన్సుల పాలు ఇవ్వడం మంచిది. ఇది రోగి అభిరుచిని బట్టి వెచ్చగానో, చల్లగానో, ఉండవచ్చును. పాల వాసన సహించలేనివారు, అందులో కొద్దిగా, టీ, డికాక్షను కలుపుకుని చక్కెర వేసుకుని తాగవచ్చును. రెండవ గంట, ఏరో రూట్ పిండితో చేసిన గంజి, బెంజర్‌ఫుడ్ ఇది సగం జీర్ణమయిన ఆహారం) కృత్రిమ విధానాలతో జీర్ణక్రమంలో ఒక దశవరకు తెచ్చి తయారుచేసిన ఆహారం. ఇలా అర్థ జీర్ణమయిన ఆహారమును రోగి తేలికగా జీర్ణంచేసుకోగలడు. హార్లిక్సు (ఇది మాల్టు కలిసిన పాలపొడి) వీటితోపాటు పళ్ళతో తయారుచేసిన జెల్లీలు కొద్ది పరిమాణాలలో తీసుకోవచ్చును.

మూడవ గంటలో, నజ్జు నజ్జుగా చితకకొట్టిన బంగాళాదుంపలు, పచ్చి బటానీలు, కాలీ ఫ్లవర్, బెంగుళూరు వంకాయలు, ఇటువంటి నీరు అధికంగా ఉన్న కూరగాయలు, జావ అయ్యేవరకు ఉడకబెట్టి, ఆ జావ యివ్వవచ్చును. దీనిలో బాదంగింజలు, సోయా–బీను, చిక్కుడుగింజలు పొడిచేసి ఉడికేటప్పుడు కలపవచ్చును. పాతబియ్యం కచ్చాపచ్చగా వేయించి గరకగా విసిరి, అది పునః పాకంచేసిన అన్నము, గోధుమపిండితో తయారయిన పూరీలను పాలలో నానవేసి, యివ్వవచ్చును. గుజ్జుఉన్న కాయగూరలన్నీ నలగగొట్టి కాస్తే, వాటిలో సారం తేనెవంటి చిక్కని పదార్థంగా తయారవుతుంది. అది చాలా పుష్టికరమైనదీ, తేలికగా జీర్ణమయ్యేదీ అయిన ఆహారపదార్థము. ఇల్లా తయారయిన పదార్థమును ఇంగ్లీషులో సూప్ Soup, అంటారు.

నాలుగవ గంటలో పాలు, 5వ గంటలో హార్లిక్సు బెంజర్స్‌ఫుడ్ వంటి, ఆహారము, తీయని మజ్జిగ ఇవ్వవచ్చును. మజ్జిగ, పాలలోఉండే కేసిన్, Casein) కొవ్వూ తీసివేయగా మిగత వస్తువు. అందులో పాలలోఉండే ప్రోటీనులు, లవణములు విటమినులు అన్నీ ఉంటవి. ఈ విధంగా, ఆహారం ప్రతి గంటకు మార్చుకుంటూ పోవాలి. ఏరో రూట్‌పిండితో తయారయిన బిస్కట్, నాను రొట్టెలో మెత్తని భాగము, కొద్దిగా వెన్న, తేనె, అప్పుడప్పుడు తీసుకోవచ్చును.

రాత్రివేళ రోగి ప్రక్కన పాలు సిద్ధంగా ఉండాలి. బాధతో, రోగి నిద్రలేచినప్పుడల్లా ఆహారం యివ్వవలసి ఉంటుంది. బాధలేకుండా నిద్రపోతున్నప్పుడు లేపి యివ్వవలసిన అవసరంలేదు.

మ్యూకస్ మెంబ్రేనులు ఆరోగ్యంగా ఉండడానికి విటమిన్ 'సి' చాలా అవసరం, పైన చెప్పినట్లుగా తయారుచేసిన ఆహారానికి, ఆహారానికీ మధ్య అవసరమయినంత నీరు తీసుకోవచ్చును. ఆహారంతో చేర్చి, నారింజ, టొమేటో వంటి పళ్ల రసములను తీసుకోవచ్చును. వీటిలో విటమిన్ 'సి' ఉన్నది. ఇది సాధ్యంకానప్పుడు 100 మిల్లి గ్రాముల పరిమాణంలో విటమిన్ 'సి'. పాలుతో చేర్చి తీసుకోవాలి. సీలిన్ (Celin ఓడాగ్జా! Redoxon) మాత్రలు 'సి' విటమిన్‌తో తయారయినవి. అన్నిచోట్ల లభించేవి.

ఆహార పదార్థములలో, ప్రోటీనులు, కార్బోహైడ్రేటులు, హైడ్రో కార్బనులు అని మూడు రకములయిన ఆహార పదార్థములున్నవిగదా! పాలలో ఈ మూడుఉన్నవి. ఇవిగాక స్వల్ప పరిమాణాలలో కేల్షియం, ఫాస్ఫరస్, ఇనుము, విటమిన్ 'ఎ' ఉన్నవి. విటమిన్, 'బి' అతిస్వల్పంగా ఉంది. విటమిన్ 'సి' శూన్యం. అది అల్సరు రోగికి చాలాఅవసరం అందుకని ప్రత్యేకంగా చేర్చవలసిన అవసరం యేర్పడున్నది.

మనదేశంలో ఆవుపాలు, గేదెపాలు త్రాగుతారు, గేదెపాలలో ప్రోటీను, కొవ్వు అధికం; పిండి పదార్థం సమానం. ఒకగ్రాము ప్రోటీను 4.1 కేలరీల ఉష్ణశక్తిని యిస్తుంది కార్బోహైడ్రేటు — అంతే ఉష్ణశక్తిని యిస్తుంది. కొవ్వు పదార్థము ప్రతి గ్రాముకు 9.1 కేలరీల ఉష్ణశక్తిని యిస్తుంది. ఒక ఔన్సు ఆవుపాలలో .9 గ్రాముల ప్రోటీను. 1 గ్రాము కార్బోహైడ్రేట్ 1.4 గ్రాముల కొవ్వు పదార్థము ఉన్నవి. గేదెపాలలో ప్రతి ఔన్సుకు గ్రాము1.2 ప్రోటీను, 2.5 కొవ్వుపదార్థము 1.4 గ్రాము కార్బోహైడ్రేటు ఉన్నవి. ఒకఔన్సు ఆవుపాలు 18 కేలరీల ఉష్ణశక్తిని ప్రసాదిస్తుంది. గేదెపాలు ఔన్సుకు, 33 కేలరీని ఉష్ణశక్తిని యిస్తుంది. కాని యీ ఉష్ణశక్తి, పాలు శరీరం జీర్ణం చేసుకో గలిగినప్పుడే తయారవుతుంది. గేదెపాలకంటే ఆవుపాలు తేలికగా జీర్ణమవుతవి. 5 ఔన్సుల ఆవుపాలు 90 కేలరీల ఉష్ణశక్తిని యిస్తుంది. పాలు, రోజుకు ఆరుసార్లు తీసుకుంటే, 540 కేలరీల ఉష్ణశక్తిని యిస్తుంది.

తీవ్రస్థితిలో అల్సరు—రోగి పరిపూర్ణ విశ్రాంతితో ఉంటాడు. అంటే, అతనికి షుమారు 2000 కేలరీల సరఫరా ఆహారం కావలసి ఉంటుంది. మిగతా కేలరీలు అయ్యేటట్లుగా ఇతర ఆహారపదార్థములు ఆహారంలో చేర్చాలి. అవి తేలికగా జీర్ణమయ్యేవి, విటమిన్లు లవణములు పుష్కలంగా ఉండేవి, ఉండాలి. మన దేశంలో లభించే ఆహార పదార్థములు ఔన్సుకు ఎన్ని కేలరీలు సరఫరా చేస్తావో క్రింద సూచిస్తున్నాను: బాదంపప్పు—ప్రతి ఔన్సుకు 186 కేలరీలు

| | | | |
|---|---|---|---|
| ఏపుల్‌పండు | ప్రతిఔన్సుకు | 16 | కేలరీలు |
| అరటిపండు | " | 43 | " |
| మాంసం | " | 32 | " |
| బీట్‌రూట్ | " | 18 | " |
| కాకరకాయలు | " | 7 | విటమిన్'ఎ'బి, అధికం. |
| వంకాయలు | | 10 | " బి2 " |
| పెద్దచిక్కుడు | | 17 | |
| కేబేజీ | | 9 | " ఎ, సి అధికం. |
| కేరట్ | | 13 | "ఎ అధికం |
| కాలీఫ్లవర్ | | 11 | కేల్షియం అధికం |
| చీజ్ | | 99 | |
| చోళ్లు | | 101 | |
| కొబ్బరికాయ | | 126 | |
| గుమ్మడి | | 4 | |
| పెరుగు | | 14 | |
| ఖర్జూరకాయలు | | 80 | విటమిన్ ఏ. అధికం. |
| ములగకాయలు | | 7 | |
| గుడ్డు | | 51 | |
| వెల్లుల్లి | | 49, ఏ., | భాస్వరం అధికం. |
| పచ్చిద్రాక్ష | | 9 | |
| వేరుశనగ | | 156 | విటమిన్ బి2 అధికం |
| బెండ | | 12 | |
| నిమ్మపండు | | 16 | |
| లివరు | | 43 | |
| ఉల్లి | | 14 | విటమిన్ ఎ. అధికం |
| నారింజ | | 14 | |
| బటాణీ | | 31 | |
| అనాస | | 14 | |
| దానిమ్మ | | 18 | |
| పచ్చు అరటిపండు | | 19 | విటమిన్ బి అధికం |
| బంగాళాదుంప | | 28 | |
| ముల్లంగి | | 6 | |

—౭౭ వ పేజీ చూడండి

# కృష్ణాయింగి




"ఇయ్యాల ఎట్టాగైనా సూదిమందు కొవుక్కుని యింటికెల్లాలి," అనుకున్నాడు పాముల సింగన్న.... అతని భార్య గంగి ఒళ్లెరగని జ్వరంతో పల్లెటూరి పూరి—పాకలో పడిఉంది. ఆ ఊరి డాక్టరు "సూదిమందు యివ్వకపోతే జ్వరం తగ్గదు," అంటూ ఆ క్రిందటిరోజు సాయంకాలం చీటీ వ్రాసి యిచ్చాడు. "ఎంతవుతాయి బాబయ్యా ఈ మందులు ?" అని అడిగితే, "మూడు రూపాయలవుతా"యన్నాడు. సింగన్న రైలు దిగి వచ్చి తవ పని ప్రారంభించి మూడు గంటలు దాటింది. ఇంత వరకూ పావలా బేరం మాత్రమే తగిలింది....కడుపులో మండుతూఉంటే ఆ డబ్బులు పెట్టి రెండిడ్లీలు తిని, టీనీళ్ళు త్రాగాడు....

కొన్ని నిముషాలాగి తన చుట్టూ కొంతమంది జనం చేరడం గమనించి, అతడు "సూడండి బాబూ" అంటూ పాము—బుట్టమీది మూత తీశాడు. నల్లని కోడెత్రాచు 'బుస్సుమని' బుసకొడుతూ లేచింది. సింగన్న ఎడమ చేతితో బుట్ట—మూత పట్టుకొని పామును ఉడికిస్తూ కుడి మోకాలు మడిచి ఊపుతున్నాడు. నల్లగా నిగనిగలాడే పడగమీద తెల్లని కృష్ణపాదాలు మనోహరంగా మెరుస్తూఉండగా ఆ త్రాచుపాము తల అటూ యిటూ ఊపుతున్నది. అదను దొరికినప్పుడు బుస్సుమని కాటువేయబోతున్నది.

అతని చుట్టూ పదిమంది జనం నిలబడి చోద్యం చూస్తున్నారు. అతడు ఒక వేరు చేతిలో ఉంచుకొని ఆ చేతిని పామునోటి దగ్గరికి తీసుకువెడుతూ, "సూడండి బాబూ! దీని మగత్యానికి ఎంత యిసపు పురుగైనా సరే, అట్టాఅట్టా తొలగిపోవాల.... మారాజులు .... మీరు కాల్చిపారేసే సిగరెట్టు కరీదు సెయ్యదిది.... ఏ యేళప్పుడు యాడకి పోతన్నా బొడ్లో కట్టుకు పోతే, చుట్టుపక్కల యిసపు జివాలన్నీ తొలగుండిపోవాల.... బేడ్డబులకోసం సూడమాకండి బాబులు...." అంటూ అలాగే వేరును పాముకు వాసన చూపించాడు. అంత పగతోనూ, భయంకరంగా లేచి కాటువేయ బోతున్న పాము ఎందుకో పడగను కుంచించుకుని తలవంచుకుని అణిగిపోతున్నది....

ఒక్కనిముషం తర్వాత సింగన్న బుట్టమీద మూతను మళ్లీ ఉంచుతూ, "ఈ పామును పట్టి అయిదురోజులవుతాది బాబయ్యా ! శేషను మాస్టరుగారి యింటి దూలానికి చుట్టుకుని ఉంటే పట్టేసినాను.... ఇదంతా గారడీ అనుకోమాకండి బాబులూ.... చెట్టు పుట్టలెంబడి తిరిగి, కట్టబడి సంపాయించిన పేరు యిది.... వరిగె ముగ్గులవోళ్ళ. ఆడినమాట పొల్లుకాదు" అంటున్నాడు.

చుట్టూ చేరినవారిలో ఎక్కువమంది పామునూ, దాని ఆటనూ చూసేందుకే నిలబడ్డారు. సింగన్న బుట్టమీద మూత వేసివెయ్యగానే, అందులో నలుగురైదుగురు తమ దారిన తాము వెళ్లిపోయారు. మిగిలినవారు మళ్లీ పాము నెప్పుడు తీస్తాడా అని కాచుకుని ఉన్నారు. ఒక్కరుకూడా బేడ డబ్బులు యిచ్చి ఆ వేరుముక్కను కొన్న పాపన పోలేదు....

సింగన్నమాత్రం తన దగ్గరఉన్న వేరు మహత్యాన్ని పెద్దగొంతుకతో చాటుకుంటూనే ఉన్నాడు. మళ్లీ అయిదు నిముషాలలో మరికొంతమంది జనం వచ్చి చేరారు. నలుగురైదుగురు పిల్లలు పాము బుట్టమీద మూత ఎప్పుడు తీస్తాడా అని ఆత్రంగా ఎదురు చూస్తున్నారు.

అతడు మళ్లీ బుట్టమీది మూత తీసి, తన వేరు గొప్పదనాన్ని సోపపత్తికంగా నిరూపించడం ప్రారంభించాడు.... ఈ సారి అక్కడ చేరిన పదిపదిహేను మందిలోనూ యిద్దరు—ముగ్గురు జేబులు కొట్టేవారున్నారు. జనంఅంతా భయంకరంగా ఆడుతున్న పామువంకా, సింగన్నచేతిలోఉన్న వేరువంకా శ్రద్ధగా చూస్తూఉంటే, వారుమాత్రం పక్కవారి ముఖాలనూ, వారి జేబులనూ చూస్తున్నారు.

మళ్లీ సింగన్న పాము—బుట్టమీద మూత వెయ్యగానే, వారిలో కొందరు తమ పనులమీద తాము వెళ్లేందుకు వెనుదిరిగారు.... పిల్లలుమాత్రం బడికి వేళ అవుతున్నా, కదలకుండా మళ్లీ చూసేందుకోసమని అలాగే నిలబడిఉన్నారు. ఇంతలో, ఏం జరిగిందో తెలియదు; వెనుదిరిగిన వారిలో ఒకాయన ఒక్కసారిగా గావుకేకపెట్టాడు. అందరూ "ఏమయింది ? ఏమయింది ?" అంటూ, ఆయన చుట్టూ చేరారు. ఆయన ఆదుర్దాపడుతూ జేబు వెదుక్కుంటూ "నా పర్సు...." అని మాత్రం అన్నాడు. అందరికీ అర్థమయింది... "అందులో డబ్బేమాత్రం ఉందేమిటి ?" అని అడుగుతున్నాడొకాయన.... డబ్బు పోగొట్టుకున్న మనిషి మొహాన పట్టిన చెమటను కండువాతో తుడుచుకుంటూ: "పాతిక రూపాయలుండాలి...." అన్నాడు.

"ఇంకెందుకూ వృధా ప్రయాస ?.... ఈపాటికి చేతులు మారి చేరవలసిన చోటికి చేరేఉంటుందది.... ఎంతండీ ? క్షణాలమీద చేతులు మారిపోతాయి వస్తువులు...." అన్నాడొకాయన.

"అంత పకడ్బందీగా జరుతున్నాయన్నమాట దొంగతనాలు !" అని ముక్కుమీద వేలువేసుకున్నాడు మరొక వ్యక్తి.

ఇంతలో ఒక పోలీసు పేవ్‌మెంటు ఎక్కి వచ్చి "ఏమిటి ? ఏమిటి ? ఏం జరిగింది ?" అని ప్రశ్నించాడు. అక్కడివారిలో ఒక మనిషి పర్సు పోగొట్టుకున్న వ్యక్తిని చూపించి "వీరి పర్సు పోయిందండీ.... అందులో పాతిక రూపాయ లుండాలిట.," అన్నాడు. వివరాలన్నీ విని, పోలీసు కాస్సేపు చికాకుపడి, తర్వాత, "అంత అశ్రద్ధగా ఉంటే ఎల్లాగండీ మరీనూ ? మీపక్కన ఎవరు నిలబడిఉన్నారో గుర్తుపట్టగలరా ?" అని అడిగాడు. డబ్బు పోగొట్టుకున్న ఆసామీ: "ఇది బావుంది.... ఎలా చెప్పగలను ? నేను నా పక్కవాళ్ల మొహాలు చూసేం

—45 వ పేజీ చూడండి

## వనితాలోకం

# వరుసలూ - వయస్సూ

'హైమ'

సాధారణంగా మనలో ఒకరి నొకరు వరుసలతో సంబోధించటం బాగా అలవాటు. పెద్దవాళ్లని మామ్మగారని, అత్తగారని, వదిన, అక్కయ్య మొదలైన వాటితోను, చిన్నవాళ్లని మరదలు, చెల్లెలు, అమ్మాయ్ అని పిలుస్తూ ఉంటాము. అసలు ఈ విధంగా పిల్చుకోవటంలో ఒక విశేష ముంది. ఇలా వరుసలు కలపటంతో ఒకరికొకరు సన్నిహితు లౌతారు. ఒకరిపై మరొకరికి, ఎనలేని ఆప్యాయత కలుగుతుందనటంలో సందేహంలేదు.

వదిన, మరదలు—వరుసల్లో మనం హాస్యాలాడుకుంటాం; మామ్మ—వరుసలవారిని గౌరవిస్తాం. అమ్మాయ్—వరుసలవారిని ఆప్యాయతతో చూస్తాం. రక్తసంబంధం లేకున్నా, అక్కయ్య, చెల్లెలు—వరుసలైనవారికి ఏ ఆటంకం సంభవించినా మనం తల్లడిల్లిపోతాం. దీనినిబట్టి చూస్తే, ఒకరి కొకరు మరింత సన్నిహితులవటానికి ఈ వావి — వరుసలు చాలా తోడ్పడుతున్నాయని మనకి విశదమవుతోంది.

ఈ వరుసలతో సంబోధించడం, మగవారిలో కన్న మనలోనే ఎక్కువ. సామాన్యంగా మగవాళ్ళు పేరుపెట్టి పిలుచుకుంటారు. క్రొత్తలో 'ఏమండీ' అని సంబోధించుకున్నా, నాలుగురోజులవగానే, ఏదో వరుస కల్పించుకుని దానితోనే మనం సంబోధించుకుంటాము. కాని ఈ సంబోధనలు సవ్యంగా ఉన్నంతవరకు బాగానే ఉంటుంది. అపసవ్యమైతే హాస్యాస్పదంగా ఉంటుంది సుమండీ!

ఒకసారి మా శారద—యింటికి వెళ్లాను. శారద క్రొత్తగా కాపరానికి వచ్చిన రోజులు. నూతన సంసారాన్ని గురించి చర్చించుకుంటూ కూర్చున్నాం. ఇంతలో దొడ్డితలుపు తట్టుతూ "అక్కయ్య గారూ !" "అక్కయ్యగారూ ! !" అనే మాటలు వినిపించాయ్. శారద వెళ్లి తలుపు తీసింది. చూద్దును కదా! ఆవిడకి కనీసం నలభైఏళ్ళకి తక్కువగా ఉండవు. వచ్చిన పనేదో చూచుకుని వెళ్లిపోయింది. నిండా యిరవైఏళ్లన్నా లేని శారదని, "అక్కయ్య గారూ !" అని పిలుస్తుందేమా అని ఆశ్చర్యంగా అడిగాను.

"వాళ్లకదో అలవాటు. అదేమంటే, చిన్న దానినిగా సంబోధించి యితరులను కించపరచటం మాకు అలవాటు లేదమ్మా ! ఎవరినైనా సరే 'అక్కయ్యగారని' 'పిన్నిగారని' సంబోధించి గౌరవించటం మాకు అలవాటు ఉందిలెండి," అని అంటారు. ఇంకా నయం; వచ్చిన కొత్తలో ఆవిడ నన్ను "అత్తగారూ" అని పిల్చేది అంటూ, శారద చెప్పిన మాటలు విని నవ్వాపి లేకపోయాను.

ఒకరిని గౌరవించాలనుకుంటే, అత్తగారనో, అక్కగారనో సంబోధిస్తేనేనా, గౌరవించినట్లని పించేది ? సవ్యంగా, మర్యాదగా మాట్లాడితే చాలదూ ? అదీకాక, చిన్నవారిని వారి వయసుకి తగ్గట్లు ఏ వరుసతో పిలిచినా బాగానే ఉంటుంది. కాని, గౌరవం అంటూ అమ్మమ్మలైన వారందరూ, నిండా యిరవై సంవత్సరాలైనా నిండని వారిని అత్తయ్యగారు, పిన్నిగారు అని పిలిస్తే వినలేము సుమండీ ! ఈ వరుసలు వయస్సుకి తగ్గట్టుగా ఉంటేనే, వాటిలో అందం, చందం, అవగాహన మవుతుంది. లేకుంటే, అవి కర్ణకఠోరాలే !

ఈమధ్య మరో తమాషా జరిగింది. నేను మా స్నేహితురాలి పెళ్లికి వెళ్లాను. సూత్రధారణంతా అయిపోయింది. పారితోషికాల చదివింపులు వచ్చాయ్. కానుకలు అందుకోలేక సతమతమవుతున్నారు వధూవరులిద్దరూ. ఇంతలో దాదాపు నలభైయ్యో పడిలో ఉన్న ఒకాయన లేచి తాను పెండ్లికుమారునికై తెచ్చిన కానుక పురోహితుని చేతులో ఉంచాడు. ఆయన మంత్రాలు వల్లించి : "మీ వివాహ మహోత్సవ సందర్భంలో మీ...." అంటూ కానుక యిచ్చిన తనవైపు చూచాడు; ఏం చెప్పమంటారన్నట్లు. కానుక తెచ్చిన తను అందుకున్నాడు: "మీ మనుమడు హనుమంతరావు, తన తాతగారి వివాహమహోత్సవ సందర్భంలో సమర్పించుకున్న కానుక, 'సబ్బుపెట్టె' (వెండిది లెండి). రేపు రికార్డులా, పురోహితుడు ఆ మాట వల్లించి, సబ్బుపెట్టె పెండ్లికుమారుని చేతులో ఉంచాడు. పాపం! పెండ్లికుమారుని ముఖం ఎంత చిన్నబోయిందో చెప్పలేను. మనస్సులో ఎంత బాధపడ్డాడో అతని కళ్లే చెప్పాయ్.

పెళ్లికొడుక్కి అతని మనుమడు చదివించాడు కానుక అంటూ, పెండ్లిపందిరంతా ఒకటే గుసగుసలు; ఒకరిని చూచి మరొకరు నవ్వుకోటం.

ఇంతకీ ఆ చదివించినతనికి పాత చుట్టరికాలు తిరగేస్తే, తాతయ్య అవుతాట్ట వరుసకి పెళ్లికొడుకు. బయట మనం ఎన్ని అనుకున్నా, ఎలా అనుకున్నా ఫర్వాలేదు. కాని, పదిమందిలో అక్కడ ఆ విధంగా అంటే, ఏం బాగుంటుంది చెప్పండి ? అసలు ఈ వరుస—వాయిలేవీ లేకుండా, ఫలానివారు మీ వివాహ శుభమహోత్సవంలో సమర్పించిన కానుక అంటే, ఏ బాధా లేదు. పైగా గౌరవం కూడా ఉంటుంది.

ఆ పెళ్లిలోనే మరోతమాషా సంఘటన జరిగింది. ఇద్దరు సమ—వయస్కులుకూర్చుని ఏదో మాట్లాడుకుంటున్నారు. అందులో ఒకావిడ 'పిన్నిగారూ' అంటూ సంబోధిస్తోంది రెండోవారిని. వారిద్దరికి ఏ సంబంధం లేదని తెలుసు. సమవయస్కురాలిని ఇలా పిలుస్తుందేమా అనే ఆశ్చర్యంతో, నోరూరుకోక అక్కడే అడిగేశాను: "ఏమండీ వీరు మీకు పిన్నిగారవుతారా ?" అంటూ.

"అదేం లేదమ్మా. ఇక్కడే పరిచయం కలిగింది వీరితో" రెండో ఆవిడ నవ్వుతూ చెప్పింది.

"మరి సమ—వయస్కులు కదా, పిన్నిగారని సంబోధిస్తుంటే" అంటూ ఊరుకోక మళ్లీ రెట్టించాను. అది వినగానే మొదటి ఆవిడ అందుకుంది: "అదేమిటి అక్కయ్యా! ఆమెకి ఆరుగురు పిల్లలు; పదిహేను—యిరవై సంవత్సరాలైంది ఆవిడ కాపురానికి వెళ్లి. నాకు కూతురొక్కతేగా ? నే నింకా పుట్టింట్లోనే ఉంటున్నాను. (ఆవిడ భర్త ఇల్లరికం అని తెలిసిందిలెండి తర్వాత) ఆ లెఖ్ఖ ప్రకారం వారు నాకన్నా పెద్దవారు కదూ ? అదీకాక ఇతరులని గౌరవంగా సంబోధించటం నాకు అలవాటు ఉందిలే అక్కయ్యా !" నన్ను అక్కయ్యని చేసి, ఏదో ఘనకార్యం చేస్తున్నట్లు మాట్లాడింది. మరి ఇలాంటి అజ్ఞానులని ఏమనాలంటారు ?

కొందరికి ఈ వరుసలతో పిలిచే నామధేయాలే శిలాక్షరాలుగా నిలిచిపోతాయ్. వారిని మరో పేరుతో సంబోధించటం జరుగదు. అందులో కొన్ని, 'గుంటూరు—అత్తయ్య', 'గుడివాడ—బావ' 'హైదరాబాద్—మామయ్య' వీరు ఎక్కడికి వెళ్లినా పై నామధేయాలతోనే సంబోధింపబడుతూ ఉంటారు. ఈ పిలుపుకి చిన్న పెద్ద అనే తారతమ్యా లుండవు.

మగవారిలో కూడ కొందరికి ఈ అలవాటు ఉంది. కాని, వారు పై చెప్పినంత అసభ్యకరమైన వరుసలతో పిలుచుకోవటం నే నింతవరకు వినలేదు. అది మనలోనే ఎక్కువ మోతాదులో కనిపిస్తూ వుంటుంది.

అలాగని ఆడవారంతా యింతే అనను. ముఖ్యంగా చదువుకున్నవారు, లోకజ్ఞానం కలవారు, పై చెప్పినంత అసభ్య వరుసలతో పిలుచుకోరు. వారివారి పేర్లతో కాని, ఏమండీ అని కాని సంబోధించుకుంటూ ఉంటారు. వారి విషయంలో ఈ వరుసలకై తాపత్రయపడటం కూడ చాలా తక్కువనే చెప్పచ్చు.

కాని, మిగతా వారితోనే వస్తుంది ఈ చిక్కు అంతా. ఇంతకీ చెప్పేదేమంటే, వావి—వరుసలు తప్పని నేను అనను. అవి మంచివే; కాని, వాటితో మనం సంబోధించుకునేప్పుడు అవతలివారి వయస్సు బట్టికూడా సంబోధించటం చాలా ముఖ్యం. పెద్దవారిని, చిన్నవారిని వారివారి వయస్సుకి తగ్గట్లు వరుసలతో పిలుచుకుంటే చాలా బాగుంటుంది. కాని చిన్న వాళ్లని పెద్దవాళ్ళు పిన్నిగారు, అక్కయ్యగారు, అత్తయ్యగారు అని సంబోధించినా, పెద్దవారిని చిన్నవాళ్ళు, చెల్లాయ్, మనుమరాలా అని సంబోధించుకున్నా, మనం వినలేము సుమండీ. అవి కర్ణకఠోరాలే.






## దేశ రక్షణకు ఆభరణాలు

నేటి అత్యవసర పరిస్థితి దృష్ట్యా సి. వైదేహి గారి వ్యాసం రక్షణ నిధికి ఆభరణాలు అర్పించడంలో కొంతవరకు తోడ్పడగలదని నా విశ్వాసం. కాని ఈ విషయంలో మాత్రం స్త్రీలు ముందంజ వేయాలి. మన దేశంలో స్త్రీలు ఎంతో బంగారాన్ని దాచిపెట్టారు. అందులో గ్రామాలలో ఉండేవారికి బంగారంమీద మోజు కొద్దీ, సంపాదించిన కొద్దో గొప్పో డబ్బుతో చిన్న చిన్న బంగారు నగలు చేయించుకొంటున్నారు. బంగారమును దాచుకొనటములో ప్రపంచంలో భారతదేశం మొదటిదని ఎవరో అన్నట్లు జ్ఞాపకం. అందువలన దేశరక్షణకొరకు మహిళలు ముందంజవేసి తమ తమ దగ్గరనున్న బంగారు నగలను రక్షణ నిధికి సమర్పించినచో దేశ రక్షణ నిధికి ఎంతో తోడ్పడినవారవుతారు.

రామరాజా శంకరమ్మ (పొందుగల)

*　　*　　*

మొన్న నొకసారి పేరంటానికి వెళ్లినపుడు వచ్చిన వారిలో ఒకావిడ బంగారం— కంట్రోలు గురించి తనకున్న బాధనంతా వెళ్లపోసింది. ఇంతకీ ఆవిడ వడ్డాణం చేయించుకుందా మనుకునేసరికి ఈ ఉపద్రవం వచ్చిందట. ఆవిడ—మాటలు విని నాకు ఏమనాలో తోచలేదు. ఆవిడ కర్థం అయ్యేలా చెపుదామంటే, "మవ్వే చదువు కుంటున్నావని మా కందరికి నీతులు చెప్పొచ్చావా?" అని అడుగుతారని నోరు మూసుకుని వచ్చేశాను.

రచయిత్రి వ్రాసినట్లు నేడు మన దేశం అత్యంత విషమ పరిస్థితిలో ఉంది. ఈ సమయంలో స్త్రీలు ముందుకు వచ్చి తమ ఆభరణాలను బంగారు బాండ్ల రూపంతో ప్రభుత్వాని కర్పించాలి. పురుషులు సైనికులుగా చేరి, తమ కర్తవ్యాన్ని నెరవేరుస్తున్నప్పుడు మనం మాత్రం ఈ కొద్ది త్యాగాన్ని ఎందుకు చేయకూడదు.

కుమారి అయ్యగారి సూర్యకాంతం (రాజమండ్రి)

*　　*　　*

సి. వైదేహిగారి వ్యాసం తృప్తికరంగా ఉంది. నిజ స్థితిలో నిష్ప్రయోజనంగా ఒంటిమీద ఉండే బంగారానికి ప్రస్తుతం మంచి విలువ దొరికిందని చెప్పవచ్చును.

ఆళ్లచెర్వు అన్నపూర్ణా రంగయ్య (గుంతకల్లు)

*　　*　　*

ఈ వ్యాసం స్త్రీలే కాక పురుషులు కూడా ఉపయోగించుకోవాలి. ప్రస్తుత అత్యవసర పరిస్థితులలో మాత్రమే కాక, భవిష్యత్‌లో సైతం దేశ ఆర్థిక స్థిరత్వాన్ని కాపాడడానికి వాణిజ్య ప్రముఖులు, పారిశ్రామికదారులు, స్త్రీ పురుషు లిరువురు కూడా బాగా కృషిచెయ్యాలి. దేశరక్షణ సన్నాహాలను ద్విగుణీకృతం చేయడానికి ఆర్థిక స్థిరత్వం ఎంతో అవసరం. పరిపాలనా యంత్రాంగము, స్త్రీ పురుషులు, వ్యాపారస్తులు, పారిశ్రామికులు సహకరించినట్లయితే ఆర్థిక స్థిరత్వం చెక్కుచెదరనీయక కాపాడవచ్చని నా అభిప్రాయము. ఆభరణా లిచ్చినంత మాత్రాన దేశరక్షణకు పూర్తిగా తోడ్పడినట్లు కాదు. ఆ మాటకు వస్తే పేదలు కూడా తమకున్న కొద్దిపాటి ఆభరణాలూ ఇచ్చారు దేశరక్షణకు. కాని సంఘంలో కీలక స్థానంలో ఉన్న వర్తకులు, వ్యాపారులు, పారిశ్రామికదారులు చేయవలసిన కృషి చాలా ఉన్నది. పారిశ్రామిక పనులలో స్త్రీలు కూడా ప్రవేశించుచున్నారు. మన పొరుగున కౌటిల్యం, మాత్సర్యం గల దేశం ఉన్నదని గ్రహించి, దాని దురాక్రమణను ప్రతిఘటించడానికి దేశాన్ని అన్ని విధాల సహాయత్తం చేయాలి. పురుషులే కాకుండా స్త్రీలు కూడా తమ కర్తవ్యాన్ని గుర్తెరిగి సర్వవిధాలా దేశాన్ని పటిష్ఠం చేసినట్లయితే, దురాక్రమణదారుని పూర్తిగా తరిమికొట్టగలము. కనుక ఆభరణా లివ్వడమే గాకుండా, స్త్రీలు తమ శక్తి ఉన్నంతవరకు మిగతా పనులలో కూడా కృషి వహించాలి. ఎవరు ఏ వృత్తి స్వీకరించినా, ఆభరణా లిచ్చినా (పేరు కొరకు కాకుండా) దేశ స్వాతంత్ర్యానికి వినియోగపడాలనే దీక్షతో కృషి సాగించాలి.

కుమారి టి. భూమాదేవి (హైదరాబాద్)

## పిల్లల ఎదుట

శ్రీమతి విశాఖగారు వనితాలోకానికి తన వ్యాసం ద్వారా నొసంగినట్టి సలహాలను ఆజన్మాంతము మరువరానివని నా తలంపు. వారికి నా అభివందనములు పత్రిక ద్వారా తెల్పుచుంటిని.

ఒకరోజు నేను వంట చేయునపుడు పొగ కళ్లలోనికి పోవుటచే కంటినుంచి నీరు కారుట చూచి, మా వర్ధన్‌బాబు "అమ్మా—అమ్మా! నాన్న—నిన్ను—కొప్పడ్డాడు—చెప్పవు— చెప్పవూ" అని అడిగాడు. అప్పుడు నాకే చాలా సిగ్గేసింది పిల్లల ఎదుట అలా చేసినందుకు.

మేము పిల్లల ఎదుట జాగ్రత్తగా మెలగుటకు ప్రయత్నము చేయుదుము. గాన పిల్లల ఎదుట—పెద్దవారు అన్ని విషయాలలో అతి జాగరూకులై మెలగవలయును నా మనవి.

కాకుమాను కామేశ్వరమ్మ (పాలప్రరు)

*　　*　　*

భావి—పౌరులు కాబోయే పిల్లల ఎదుట తల్లిదండ్రులు తమ మాటలలోను, చేతలలోను తప్పులు లేనట్టుగా జాగ్రత్తగా నుండవలెను. లేనిచో పిల్లల భావి—జీవితములు చెడుట సహజము. ప్రస్తుతము ఆ విధముగ చాలామంది వుండవచ్చును. అటువంటి వారికి విశాఖగారు వ్రాసిన వ్యాసము తారకమంత్రమువలె ఉపకరించును.

దుర్గా వరలక్ష్మి (నౌపడా)

*　　*　　*

విశాఖగారు వ్రాసిన "పిల్లల ఎదుట" అనే వ్యాసం చదివాను. వారు భావాన్ని బాగానే వ్యక్తం చేశారు. కాని అయిదవ పేరాలో "తిట్లు" అనే మాటని ఉపయోగించటానికి "సంస్కృత పదాలు" అన్నారు. అంటే వారి భావంలో "సంస్కృత పదం" అంటే "తిట్టు" గా భావిస్తున్నారన్నమాట. ఎంత రచయితయినా వేద భాషయైన సంస్కృతమును తమ యిచ్ఛ వచ్చినట్లు వాడితే, పాఠకులకు వారిమీదుండే గౌరవం సన్నగిలే అవకాశం ఉండకపోదు. గావున రచయిత గారు యిట్లాంటి మాటలను యికముందు వాడకుందురని ఆశిస్తున్నాము. ఇట్లాంటి మాటలను కనీసం "సంపాదకులు"యినా విసర్జిస్తే బాగుంటుందేమో!

పి. శ్రీనివాసమూర్తి (హైదరాబాద్)

## అందాలకు చిట్కాలు

వైరాణిగారి "అందాలకు చిట్కాలు" వ్యాసంపై వ్రాసిన విమర్శలు చూచి ఈ ఉత్తరం వ్రాయకుండా, ఉండలేక పోతున్నాను.

ఈ వ్యాసం ఆడవారి కొరకు వ్రాసినారని తెలియకుండా, "మగవా రిలాంటి అలంకరణ చేసుకొంటే బాగుంటుందా?" అని ఒక వ్యాసంలో, "పౌడర్లు, స్నోలు అద్దుకొంటే భారతీయ సంప్రదాయానికే విరుద్ధం" అని ఇంకొక వ్యాసంలో వ్రాశారు. అంటే, ఈ వ్రాసినవారు పౌడర్లు, స్నోలు వాడటంలేదా?

ఉన్న అందాన్ని ఇంకా ఆకర్షణీయంగా చేసుకొనేందుకు ఈ చిట్కాలు తప్పకుండా పనికి వస్తాయి. మీకి వ్యాసం ఇష్టం లేకపోతే సరే, ఇష్టమున్నవాళ్లయినా చదువుతారు. "నా అభిమాన పత్రికలో ఇలాంటి వ్యాసాలు వేసినందుకు చింతిస్తున్నాను" అనే వ్యాఖ్యలు వ్రాయటం ఏమీ బాగులేదు.

ఎస్. సూర్యనారాయణ (కర్నూలు)

*　　*　　*

'అందాలకు చిట్కాలు' అనే శీర్షిక బాగుంది. చాలా ఉపయోగంగా కూడా ఉంటోంది. ఇందుకు వైరాణి గారికి నా ధన్యవాదములని చెప్పవలెను. ఈ 'అందాలకు చిట్కాలు' అనే దానిని చదివి ఇంటిలో ఆడవాళ్లు ఖర్చు ఎక్కువగా చేస్తారని, కొంతమంది

మొగవారు లేక కొంతమంది ఆడవారి పేరుతో మొగవారు ఈ శీర్షిక బాగాలేదని విమర్శలు వ్రాయవచ్చు. అంతమాత్రంచేత వైరాణిగారు నిరుత్సాహపడ నవసరంలేదు. అందాన్ని పోషించుకోగల సామర్థ్యం ఉన్నవారే అనుసరిస్తారు. లేనివారు మానె, వసువు రాసుకోవచ్చు. దానికోసం ప్రత్యేకంగా ఎవరూ రాయనక్కర్లేదు.

వి. రామశేషమ్మ (హైదరాబాదు)

* * *

వైరాణిగారు వ్రాస్తున్న "అందాలకు చిట్కాలు" చదివేందుకు బాగానే ఉన్నా, ఆచరణలో పెట్టటము చాలా కష్టము అనిపిస్తుంది. ఒకవేళ ఆచరణలో పెట్టినా, నాటకాలలోను, సినిమాలలోను వేషం వేస్తున్నట్లు ఉంటుంది. దేవుడిచ్చిన సహజమైన అందము—ముందు కృత్రిమముగా తయారైన అందము ఎలాంటిదో చాలామందికి తెలుస్తూనే ఉంటుంది. ఈ వ్యాసము పనిలేకుండా ఉండే స్త్రీలకు తప్ప, మధ్య తరగతి కుటుంబీకులకు పనికిరాదని నా ఉద్దేశ్యము. అందాలకు చిట్కాలలో మూడవ వ్యాసము 'చర్మ సౌందర్యము' మొదలగునవి అందరికీ పనికివచ్చును.

మణి (నల్గొండ)

* * *

వనితావాణిలో యీమధ్య "వైరాణిగారు" రాస్తున్న "అందాలకు చిట్కాలు" లో పేరు—గొప్ప మాత్రమే కనబడుతున్నది. ఇచ్చే సలహాలేమీ కనబడవు. క్రీం, స్నో, పౌడరు, లిప్‌స్టిక్ వాడటం అందరికీ యిదివరకే తెలుసు. సౌందర్యం పెంపొందించేటందుకు, ముఖ్యంగా మధ్య—తరగతి స్త్రీలు వాడవలసిన లేపనాలు, లోషన్లు, ఆరోగ్యవిధులు, ఆహార విషయాలు మొదలగునవి వ్రాస్తే, వనితా లోకం సంతోషిస్తుంది. గృహ—నిర్వహణ విషయం పైనా? విశాఖగారు వ్రాసినట్లుగా గృహ సమస్యలపైనా వ్యాసాలు ఎంతో ఉపయోగపడుతాయి. ఇతర దేశములలో గల స్త్రీల ఆకార, ఆహార, ఆచార, విహారాదుల విషయాల గురించి వ్రాసినా బాగుంటుంది. దయయుంచి వనితావాణిలో స్త్రీలోకమునకు ఎంతో ఉపయోగించు అంశముల వేర్పాటు చేసెదరని నమ్ముచున్నాను.

తురగా సామ్రాజ్యలక్ష్మి (గుంటూరు)

* * *

వైరాణిగారి అందాలకు చిట్కాలు సామాన్యంగా ఎక్కువ ఎవరికీ ఉపయోగపడవు. వారి చిట్కాలు ఏమంత సంతృప్తినీయలేకపోయాయి. పాఠకులైనా సరే, వైరాణిగారైనా సరే, నా ప్రార్థనను ఆలకిస్తారనుకుంటాను. నా మొఖం ఎప్పుడూ జిడ్డుగా ఉంటుంది. ఎప్పుడూ సబ్బుతో శుభ్రంగా మొహం కడుక్కున్నా సరే, జిడ్డుగా ఉంటుంది. ఎక్కువ క్రొవ్వు పదార్థములుకూడ తినను. నివారణోపాయము ఏమిటో తెలుపగోర్తాను; ఎవరయినా సరే!

వండూరి రమాదేవి (ఆరుగొలను)

* * *

వైరాణిగారి వ్యాసం బాగానే ఉంది. వారి చిట్కాలకి నాదొక చిన్న చిట్కా—పౌడరు ఉపయోగంలో. కొంతమందికి మొఖంపై కాయలు పుడుతూ ఉంటాయి. వీటిని చేతితో చిదిమివేయకూడదు. రోజూ రాత్రి వేడినీటితో, మరల చన్నీటితో మొఖం కడుగుకోవాలి. ఈ కాయలు పోయే వరకూ, పౌడరు వాడకూడదు. పౌడరుకి బదులు స్నో వాడవచ్చు. ఇలా చేస్తే, చిన్న చిన్న కాయలు పోయి, నునుపుదనం ఏర్పడుతుంది.

ఎ. వి. లక్ష్మి (రౌర్కెలా)

★

# వంటలు

## 'డోనట్' లు

[ఈ పిండివంటంటే అమెరికాలో చాలా ఇష్టపడతారు.]

| | |
|---|---|
| వెన్న | 3 చంచాలు |
| చక్కెర | 12 చంచాలు |
| ఉప్పు | చిటికెడు |
| మైదాపిండి | 1 అర్థాకు లేక ఒక కప్పుకి కొంచెం తక్కువ |
| పాలు | ¼ కప్పుకి కొంచెం తక్కువ |
| లవంగంపొడి | చిటికెడు |
| కోడిగుడ్డు | సగం భాగం |
| బేకింగ్ సోడా | ¼ చంచా |

కరగబెట్టిన వెన్నకి చక్కెర, గుడ్డు కలిపి బాగా 'చిలకాలి'. తర్వాత పాలు, పిండి, బేకింగ్ సోడా, ఉప్పు చేర్చి బహు కొద్దిగా కలపాలి. ఆపైన పిండిని ఉండలు చేసి, గారెల వలె ఒత్తి, (మధ్య రంధ్రం కొంచెం వెడల్పుగా ఉండటం మంచిది), నేతిలో లేక వనస్పతిలో వేయించాలి. వండేటప్పుడు ఎక్కువగా కదిలించరాదు. వేగిన తర్వాత న్యూస్‌ప్రింట్ వంటి కాగితం మీద ఉంచి చమురు కొంత తీసివేయాలి. ఆపైన పొడి చేసిన చక్కెర అద్ది తినాలి.

★






రజని ఆఫీసులోకి అడుగు పెడుతూనే ఠీవితో, దర్పంతో తీరగా నలుమూలలకూ చూచింది. ఆమె కళ్ళకు కనిపించిన వాటిలో — కంటికానిన వల్లా మూలగా ఉన్న గదిలోకి పోవటానికున్న స్ప్రింగ్ డోరూ—ఇవతలి హాలులో ముగ్గురు నలుగురు నెలసరి జీతానికి తెలివితేటలు అమ్ముకుంటున్న వాళ్ళూ, వాళ్ళ తాలూకు కుర్చీలూ, మేజా బల్లలూను. ఇదేదో ఒక చిన్న ఆఫీసు అనుకొన్నది రజని. ఆమె నాలుగడుగులు వేసిందో లేదో— అప్పుడే స్ప్రింగ్‌డోరు తోసుకు బయటికి వచ్చిన ఆఫీసుబాయ్—"ఎవరు కావాలండీ?" అన్నాడు. "మేనేజరుగారిని చూడాలి" అన్నది—కొంచెం పొగరుగా. "కార్డు గాని—యిస్తారా? లేక ఏవే మిటో—" రజని అతనివంక చిరాగ్గా చూసింది. ఆఫీసులోని నౌకరాయుళ్ళ చూపులన్నీ తనమీదే ఉన్నాయని ఆమె ఊహించుకోలేదు. అలాంటి ఎన్ని వందల చూపుల్ని ఆమె ఇదివరకు చూడలేదు గనుక. ఐతే ఇప్పుడా మీమాంసలో పడి కాలం వృథా చేసుకోవటం ఆమె కిష్టంలేదు. మధ్యలో ఈ శనిగాడు దపురించుపోతే ఈ పూటకి ఆమె సూటిగా లోపలికి వెళ్ళి ఉండేది. "తెల్ల కాగితం ముక్క ఉంటే యియ్యి"—అన్నది విసుగ్గా రజని.

"ఇదుగో" అని అందించాడు ఒక గుమాస్తా అరఠావు సైజు కాగితాన్ని—ఆమె ఎందుకిలా ప్రవర్తిస్తోందో మనసులో ఊహించుకుంటూ. "ఇలా కూర్చోండి" [illegible] రజని [illegible] ముక్క చించి తన పేరు రాసి [illegible]. వాడు అది కస్సి [illegible].

తను అక్కడ అలా నిల్చోటం తనకే ఎబ్బెట్టుగా ఉన్నా—ఆమెకు కూర్చో బుద్ధి పుట్టలేదు. హాలు మూలనుంచి ఎవరో హఠాత్తుగా తుమ్మారు. రజనికి గుండె ఆగినంత పనయింది. వెకిలి వెధవలు అని తిట్టుకుంది. ఇంతలో ప్యూను బైటికి రానే వచ్చాడు—రజనిని లోపలికి ప్రవేశపెట్టటానికి. ఆమె లోపలికి అడుగు పెట్టీ పెట్టగానే ఎన్ని జతల కళ్ళో వ్యంగ్యంగా, వెకిలిగా, ఆశ్చర్యంగా ఆమె వెళ్ళిన వైపుకు చూసినై.

* * *

నాలుగు రోజుల తర్వాత ఆఫీసు స్టెనో గ్రాఫరుగా చేరిన రజనిని చూస్తూనే ఆఫీసు ఆఫీసంతా ఆశ్చర్యపడింది. క్రొత్తగా స్టెనో పదవి ఖాళీ అయినప్పుడు ఒక ఆడపిల్లని ఆ పోస్టుకు వేస్తారని ఊహించలేదు వాళ్ళు. మేనేజరుగారు తెలివి గలవాడు. కాని, రజనికోసం ప్రత్యేకంగా సీటు ఏర్పాటు చేయటంలో ఆయన నేర్పు ప్రదర్శించలేదనే చెప్పాలి. ఆయున కాబిన్‌లో రెండు అరలున్నై. అందులో ఒక అరలో ఆమె సీటు వేయించాడు. వాన వచ్చినప్పుడు చెట్టుమీద ఉన్న పక్షులు గిలగిల లాడినట్లయింది గుమాస్తాల పని. ఆమెను చూడాలంటే, ఆఫీసులోకి ఆమె వచ్చినప్పుడూ—ఇంటికి తిరిగి వెళ్లేటప్పుడే. రోజూ వచ్చీ రాగానే ముక్కుకు సూటిగా లోపలికి వెళ్ళిపోయి అటెండెన్స్ రిజిస్టరు తెప్పించుకొనేది. సాయంత్రం ఆఫీసు వదిలీ వదలగానే ఆమెకోసం బయట ఒక రిక్షా ఎదురు చూస్తుండేది. ఇంత పకడ్‌బంద్‌గా ఉన్నా, కొందరి ఔత్సుకతను ఆమె ఆపలేకపోయింది. మేనేజరుగారితో ఏదో పనున్నట్లు వెళ్లో, ఆఫీసు బాయ్‌ని ఏదో పనిమీద బయటికి పంపించి, మేనేజరుగారు బెల్లు కొట్టగానే ఆ సంగతి చెప్పటానికని తాము వెళ్లో ఆమెను చూడటంతో సరిపుచ్చుకుంటూండేవాళ్ళు. చూచినప్పుడు — ఇలా కలుపుగోలుగా ఉండదని ఎవరూ అనుకొనేలేదు. ఆమె గర్వి అని అందరూ నిర్ణయించుకున్నారు.

మేనేజరుగారి గదిలో బెల్ మోగింది. ఆఫీసు బాయ్ హడావుడిగా పరుగెత్తుకెళ్ళాడు. "ఆ శంకరం గాడిని పిలు—" అన్నాడు మేనేజరు. రజని ఏ పనీ లేక నవలొకటి చదువుతున్నదల్లా మేనేజరు మాటలకు తలెత్తి చూచింది. ఈ నెల రోజుల్లోనూ శంకరం అనే మాట వినటం ఆమె కిదే మొదటి సారి. ప్యూను బయటకు వెళ్ళిపోయాడు. అనుకోకుండా, ఎప్పుడూ లేనిది, ఆమె చూపులు స్ప్రింగ్ డోరుమీద ఆగినై. అది తెరుచుకుని అతను లోపలికి వచ్చాడు. రజని ఆశ్చర్యంతో చూసింది. ఆ మనిషిని తను ఆఫీసులో చూసినట్లు గుర్తులేదు. వత్తుగా, నల్లగా పెరిగిన గడ్డం, మెడమీదకంటా వాలిపోయి రింగులు తిరిగిన జుత్తూ, కళ్ళకు భూతద్దాలలాంటి అద్దాల జోడు, కాళ్ళకు సగం తెగిపోయిన చెప్పులూ—పూర్తిగా మాసిపోయిన బట్టలూ ఇదీ శంకరం ఆకారం. హఠాత్తుగా చూస్తే ఎవరో పిచ్చివాడనుకోటం భ్రమకాదు. అతను కూడా తన వంక చూస్తాడేమోననుకొంది రజని. అతని చూపులు అక్కడ లేవు. బెరుకు బెరుకుగా కదులుతున్నై. మాసిపోయి—బోడలా లట్టు కట్టుకుపోయిన జేబు గుడ్డ తీసి కళ్ళు తుడుచుకుని మేనేజరుగారి గదిలోకి వెళ్ళాడు శంకరం.

# ఆశా జ్యోతి

తనవంక ఒకసారైనా చూడకుండా అతను వెళ్ళిపోవటం రజనికి కినుక కలిగించింది.

మేనేజరుగారు శంకరం లోపలికి వెళ్ళగానే విరుచుకు పడ్డారు. "నెల నెలా జీతం తీసుకుంటున్నప్పుడు ఉద్యోగం చేస్తున్నట్టు గుర్తుంటుందా? పని చేసేటప్పుడు గుర్తుండదూ? నీవు చేసే తప్పులన్నీ సరిచేసేందుకు ఇంకొకళ్ళని వేయమంటావా ఏం? ఎన్ని తడవలు చెబుతేమటుకేం సిగ్గు లేకపోతే? నేనే నీ పరిస్థితిలో ఉంటే, ఏం చేసేవాడినో తెలుసా........" రజని బయటనుంచి వింటున్నది శంకరం ఏదన్నా అంటాడేమోనని. శంకరం మాటా పలుకూ లేకుండా చేతులు కట్టుకు నిల్చుని ఉన్నాడు—"వెళ్ళు" అన్నాడు మేనేజరు చీత్కారంగా. అక్కడేమీ అనకపోయినా కనీసం బయటకు వస్తూ నన్నా రుసరుసలాడుతూ వస్తాడనుకున్నది రజని. శంకరం వెళ్లినప్పుడు ఎలా వెళ్లాడో, అలాగే తిరిగి వచ్చాడు. అతని ముఖంలో క్రోధం గానీ, బాధ గానీ లేవు; అసహజమైన నిర్లిప్తత తప్ప.

అప్పుడే రజని ఉద్యోగంలో చేరి ఆరు నెలలయింది. ప్రొబేషన్ పూర్తికాగానే ఆమె జీతం ఇంకొక ఏభై రూపాయలు పెరిగింది. ఫైళ్ళ

నాయుడుగారు : మేస్టారు, ఇప్పుడే హోటలుకి వెళ్ళొస్తున్నట్లున్నారు; టిఫిన్ బాగుందా?
సంగీతం మేస్టారు: ప్చ్; ఇడ్లీలకి పక్క వాయిద్యం (చట్నీ) బాగా కుదరలేదు. కాఫీ ఒకే అపస్వరం!

ఏ. కె. మోహన్ (కాకినాడ)

చాటున ఆఫీసు ఆఫీసంతా గుసగుసలాడింది. ఇప్పుడు మధ్యాహ్నం లంచ్—టైములో తక్కిన గుమాస్తాలు మాట్లాడుకోవటానికి—రెండు విషయాలు కుదిరినై. అదివరకు వాళ్ళు మాట్లాడుకో గలిగింది— ఒక్క శంకరాన్ని గురించే. అతన్ని వెకిలిగా వెక్కిరిస్తూ—వాళ్ళు మధనపడుతుండే వాళ్ళు. మేనేజరు శంకరాన్ని ఎలా ఎలా తిట్టింది—చిలుక—పలుకులుగా చెప్పుకునేవాళ్ళు. శంకరం ఎప్పుడూ వీళ్ళతో కలిసి భోజనం చేసేవాడుకాదు. అసలు కొన్ని రోజులు భోజనం కూడా చేసేవాడు కాదేమో. ఎప్పుడూ ఆరని చవకబారు సిగరెట్టుతో కడుపు నింపుకునేవాడు. "ఎంతైనా వాడి టెక్కెక్కడికి పోతుందోయ్ వెంకట్రావు—మొదట్లో ఎలా మెలిగేవాడనీ—పద్మనాభన్ని అడుగు—ఇవాళ తొడిగిన బట్ట రేపు తొడిగేవాడా? అసలు భూమిమీద ఆనేవాడా—అని? అయ్యగారు అప్పట్లో మరో సిగరెట్లు కాల్చేవాడులే!" అనేవాడు చలపతి. వినేవాళ్ళెవరైనా పద్మనాభంవంక చూస్తే అతను అక్కడ అందుకునేవాడు—"నేను అప్పుడే అనలేదూ చలపతీ—కాలేజీరోజునుంచి వచ్చిన రోజుల్లో అందరూ అంతే—బట్ట నలక్కుండా మాట్లాడు

దూడట మనుకున్నాడు ఉద్యోగమంటే—మన మంతా ఇంత కాలం ఈ గొడ్డు—చాకిరీ నేర్పుగా చేస్తున్నామంటే—అమాత్రం బేఫరవాగా ఉండలేకనా? అలా ఉండట మెందుకూ? చెప్పుదెబ్బలు తినట మెందుకూ—" "ఐనా సాటివాడుకదా అని ఎన్నో తడవలు చెప్పిచూశాను గురూ! వాడి మటుకు వాడికి ఎంత టెక్కనీ—ఏమి కథా? చూస్తున్నావుగా— మేనేజరు చేత రోజుకు పదిసార్లు ముఖాన ఉమ్మేయించుకున్నా మనతో కలుస్తాడేమో? పోనీ, ఎవడి ఖర్మ వాడిది—అయినా అంత టెక్కుండకూడదులేవోయ్—నలుగురం కలిసి పనిచేసే చోటామూ—" అని పూర్తిచేసేవాడు ప్రకాశం.

అలా సాఫీగా సాగిపోవలసిన వాళ్ల సంభాషణ యిప్పుడు వాళ్ళు ఊహించకుండా రజనికి ఏభై రూపాయల యింక్రిమెంటు రావటంతో తారుమారైంది. శంకరాన్ని గురించి వెకిలిగా, వెక్కిరింతగా మాట్లాడితే, యిప్పుడు రజనిని గురించి కోపంగా, యీర్ష్యగా మాట్లాడటం మొదలు పెట్టారు: "అసలు యీ ఆడదంతుతోటే వచ్చిందయ్యా తంతంతానూ— మొగరాయుడుకి ఉద్యోగాలు దొరక్క చస్తుంటే— వీళ్ళొకళ్ళు మధ్యాహ్నకంలో పుడకల్లా—" "ఎంతెంత వాడైనా ఆడదాని దగ్గర అలుసేలేవోయ్— లేకపోతే యిన్నాళ్ళుగా రెక్కలు విరిగేలా చాకిరీ చేసి చస్తున్నామా—మనదగ్గర కనిపెట్టలేని 'మెరిటు' ఆవిడదగ్గర ఆరు నెలల్లోనే కనిపెట్టాడా మన మేనేజరు. ఆ 'డల్‌హెడ్' కి యింత తెలివేడిస్తే లేనిదేముంది?" అని కోపంగా అన్నాడు చలపతి. మొత్తానికి రజనికిచ్చిన యీ 'ఇంక్రిమెంటు'కు ఏవో అన్యకారణాలు వెతకటం మొదలెట్టారు నెలరాయుళ్ళు.

ఒకరోజు రజని ఆఫీసుకు ఆలస్యంగా వచ్చింది. సీటులోకి వచ్చి వేనిటీ—బ్యాగు డ్రాయరులో పెడుతుంటే, మేనేజరుగారి గదిలోనుంచి ఏవో మాటలు వినపడినై. మధ్యలో శంకరం అన్న మాటలు వినబడి—ఆమె దృష్టి అటువైపుకే మళ్ళింది. ఎవరో శంకరాన్ని గురించి చాడీలు చెబుతున్నారు. అతని పనిలో ఉన్న లోటుపాట్లు చెబుతున్నారు. ఆ చెప్పే అతని గొంతు విన్నదే అయినా ఎవరిదో రజని ఊహించలేకపోయింది. రెండు నిముషాల తరువాత చలపతి బయటికి వచ్చాడు. వచ్చి, రజనివంక చూసి చిరునవ్వొకటి విసిరి వెళ్ళిపోయాడు. రజని అతన్ని చూసింది. కాని ఆమె మనసక్కడలేదు. ఎందుకో ఆమెకు తెలీకుండా శంకరంమీద జాలి కలిగింది. చలపతిమీద కోపమొచ్చింది. అతన్ని అసహ్యించుకుంది. తోటివాడి మీద చాటుగా ఆఫీసరుకు చాడీలు చెప్పే మనిషికూడా ఒక మనిషేనా అనుకొన్నది. ఆ రోజు ఆమె మనసు మనసులో లేదు. లంచ్‌టైములో ఆఫీసులోకి వచ్చి చూచింది. శంకరంమటుకు సీటులో కూర్చొని ఏదో ఆలోచిస్తున్నాడు. అతనివంక చూసి నవ్వింది రజని. శంకరం ఆమెను గమనించలేదు. ఏదో ఫైలులో కాగితాలు తీసి చదువుతూ ఉండిపోయాడు. ఇంతలో ఆమెని మేనేజరు పిలిచాడు.

మర్నాడు రజని ఆఫీసుకు రాలేదు. ఆ మర్నాడు కూడా రాలేదు. వారంరోజుల తరువాత ఆమె రిజి

—43 వ పేజీచూడండి



## నిర్వచనాలు

తెలుగు-సినిమా కథ : హిందీ, బెంగాలీ, తమిళ సినిమాల కథలు.

కళా ఖండము : కళను ఖండించు నది.

చిత్రసమీక్ష : ముందు సినిమా కథ చెప్పిన తర్వాత పేరు కొక్కొరు చొప్పున ఆ సినిమాలో పనిచేసిన వాళ్ళందర్నీ పొగుడుకు పోవడం.

మహాకవి : చాలామందికి అర్థం కాని వచనలు చాలా చేసినవాడు.

సంతకం : చదవడానికి వీలులేని విధంగా వ్రాయబడిన పేరు.

డైలాగు : రెండు లాగులు.

సెల్సుటాక్స : బైయింగ్ టాక్స.

ప్రభాకరరావు (బిలాస్‌పూరు)

* * *

## పితరుని హితవాలు'

[ఇల్లరికోపాఖ్యానము రెండవ ప్రకరణం]

కం. తన తల్లి జెప్పినట్టియు
సునీతి వాక్యములును మది సుతుడున్ పదిలం
బున నిడుకొని తన తండ్రియు
అనబోయెడి మాట గూర్చి ఆలోచించెన్.

కం. రామయ్య వచ్చి కొమరుడు
కామయ్యను కౌగలించి కన్నీరిడుచున్
"క్షేమమ్ముగ పోయి రమ్ము
క్షేమమ్ముగ ఉండుమయ్య క్షేమమె నీకున్.

కం. బద్ధకము సంజ—నిద్దుర
వద్దుసుమీ గుద్దులెన్నో వచ్చును దానం
గ ద్దింతు రింటి వారలు
మొద్దందురు తోడల్లురు ముద్దుకుమారా!

కం. తలవాకిట నెల్లప్పుడు
నిలువగరా దెప్పు డెంత నిద్దుర యైనన్
మెలకువ విడరాదు సుమా
తల నడచుచు దువ్వుకొనుట తప్పుర పుత్రా.

ఉ. వేకువ నిద్ర మేల్కొనుము వేగిర మింటి పనెల్ల దీర్పుమా
పోకగ నీకు వైల పరిశుద్ధము చేయుము పాత్ర లన్ని; కం
జీకటి పోకమున్నె సతి నిద్దుర మెల్లగ తెల్పి ప్రొద్దు పో
నీక చవుల్ జనింప మది కింపగు "కాఫియు" జేయు నాయనా.

కం. మగువ ప్రియు మబ్బె ననుచు
తెగ నీలిగి యుంటివారి దిగ్రొక్కుచు దుం
డగుడవుగా దిరిగినచో
పొగ రెల్ల డంద్రు నీదు పొరుగల్లుండ్రున్.

చం. అడిగి మడంగి అత్తకడ ఆకు మరుంగు పిందెరీతిగా
గడుపుదనమ్ము మాని పలుగాకుల షోకుల పోక ముద్దుగా
నడచిన; తోడి యల్లురకు నచ్చగ మన్నిక చేయు మైత్రితో
నుడుగక నిన్ను జుట్టుకొని యుందురు సందడి తోడ నాయనా.

కం. ఇంట గల గుట్టు నీ పొరు
గింట రవంతైన తెలుప నేగకు దానం
గంటనపడి నీ వారలు
గెంటించెద రిల్లు వెడల కినుక కుమారా!

ఉ. పెండ్లము ఇంటలేని తరి వన్నెల పొంటు తొడంగి సెంటు ని
ల్వెల్ల పసందు పూసికొని మెల్లగ జేరి వీధివాకిటన్
చల్లని గాలికై దిరుగసాగిన నల్లరివాడ వంచు నీ
యుల్ల మెరుంగలేక చెడు నూహలు జేయుదు రయ్య పుత్రకా!"

కం. ఇల్లరికాన గల నీతు
లెల్లను తెల్పిరి కొమరుకు ఆతని యనుగుం
తల్లియు దండ్రి; విచారమున్
ఉల్లమునందున పెనుగొన ఊర్పు లిడ్చుచున్.

వ. [ఇల్లరికోపాఖ్యాన రెండవ ప్రకరణంబు సంపూర్ణంబు. మూడవది యగు "అత్తింటి కాపురంబు" త్వరలో వ్రాయగలవాడ.]

కే. జి. జయరామిరెడ్డి,
ఈ. తాండ్రపాడు (కర్నూలుజిల్లా).




"పోయిన సంవత్సరం జూన్ సంచిక—నా పూర్వాశ్రమానికి సంబంధించినది?......"




అప్పుడే వచ్చిన పత్రికలో మునిగిపోయివ నేను 'పోస్టు' అన్న కేకతో ఉలిక్కిపడి చూచాను. పోస్టుమాన్ ఒక కవరు పట్టుకుని ఉన్నాడు. గబగబా వెళ్ళి అందుకున్నాను. 'శ్యామల' మీరేనా ? అంటూ ఎగాదిగా చూచాడు.

చాలారోజుల తరువాత నా పేరుమీద వచ్చిన ఉత్తరం ఇదొక్కటే. ఆశ్చర్యంతో చింపి చదివాను. నిర్మలదగ్గరనుంచి వచ్చింది :

"శ్యామలా,

ఆశ్చర్యపడుతున్నావుగదూ. ఇన్నాళ్ళబట్టి ఉత్తరం వ్రాయలేకపోయాను శ్యామలా ! నా బాధలో నేనే సతమతమయి నిన్ను కష్టపెట్టలేకపోయాను. నిజంగా, అవి బాధలు కావు శ్యామలా! బాధ్యతలు. ఇన్నాళ్టికి నీకు వ్రాయటానికి మంచి విషయం దొరికింది. నీవు సంతోషిస్తావనుకుంటాను. రేపు 15వ తారీఖున నా పెళ్ళి. నీతో ఎంతో మాట్లాడాలని ఉంది. తప్పకుండా వస్తావుగదూ.

నీ నిర్మల."

నా కళ్ళను నమ్మలేకపోయాను. నిర్మలకు పెళ్ళి. నాకు నిజంగా ఒక్కసారి హాయనిపించింది. అవును అంతేగదూ. నా చిన్ననాటి స్నేహితుల్లో నాకు ఇప్పట్లో తెలిసింది నిర్మల ఒక్కతే. మూడేళ్ళుగా అనవాలు దొరకని తరువాత వచ్చింది ఈ ఉత్తరం. ఆ సాయంత్రం వారు రాగానే చెప్పాను., వెంటనే మా ఊరువెళ్ళాలని.

"అంత తప్పనిసరి పని ఏమిటో చెప్పు శ్యామలా! అలాగే వెళదాం" అన్నారు.

"అయితే ఉండండి; కాఫీ తెస్తాను, తరువాత చెప్తాను."

కాఫీ చప్పరిస్తూ "భలేగా ఉంది శ్యామలా! సరే, అసలు సంగతి చెప్పనేలేదు." అన్నారు.

"పెద్దకథ ఓపిగ్గా వింటారుగదూ"

"కథా ? కానీ, నింపాదిగా కానీ; వంటయిందేగా ఒకటేసారి భోజనానికి లేద్దాం" నవ్వుతూ అన్నారు.

"వినండి—మరి. నిర్మల నా చిన్ననాటి స్నేహితురాలు. నేనూ నిర్మలా కలిసి చదువుకున్నాం. స్కూల్లో

బొంబాయి ఆంధ్ర మహాసభ పోటీలో బహుమతి పొందిన కథ

మాస్టారు నిర్మల వాళ్ళ నాన్న; ఎంత మంచివారని. నిర్మల—వాళ్ళమ్మ చిన్నప్పుడే చనిపోయింది. నిర్మల చెల్లి మల్లి, అన్నయ్య గోపి. గోపికి నిర్మల అంటే తగని ఇష్టం. ఏ ఆట ఆడినా నిర్మలని దొంగకానిచ్చే వాడుకాదు. కాని తనికి చెడ్డసావాసాలు అలవాటు వడ్డాయి. సరిగా బడికి వచ్చేవాడుకాదు. గోపి అంటే మాస్టారుకి ప్రాణం. మల్లి గారాబు పిల్లగా పెరిగి పెంకితనం నేర్చుకుంది. మాస్టారు పిల్లల్ని ఎప్పుడూ ఏమీ అనేవారుకాదు. తన సంతానాన్ని చూచి ఆయన మురిసిపోయేవారు. ఒకరోజు మాస్టారు అందర్నీ ఏడో ఎక్కం ఒప్పచెప్పమన్నారు. పిల్లలు చాలామంది చెప్పారు. నిర్మల చెప్పలేక తప్పులు చెప్పింది. పిల్లలందరు గొల్లుమన్నారు. మాస్టారు కోపంపట్టలేక నిర్మలను బెత్తంతో బాదేశారు. నిర్మల వెక్కివెక్కి ఏడుస్తూ ఉండి పోయింది. మర్నాడు నిర్మల బడికి రాలేదు. ఉండబట్టలేక మాస్టారింటికెళ్ళాను. నిర్మల మంచంలో కదలకుండా పడుకొనుంది. మాస్టారు దిగాలుపడి కూర్చొనున్నారు.

"నిర్మలకు జ్వరమొచ్చిందా మాస్టారూ" అన్నాను.

"అవునమ్మా; ఈ పాపిష్టి చేతులతోనే నా తల్లిని కొట్టాను. నా చేతులు పడిపోను" అంటూ వాపోయారు ఆయన.

వారంరోజుల తరువాత నిర్మల, మాస్టారు, బడికి వచ్చారు. బడికి రాగానే మాస్టారు చేసిన మొదటి పని బెత్తాన్ని ముక్కలు చేసి అవతల పారేశారు. మళ్ళీ నే నెప్పుడూ మాస్టారు ఎవర్నీ కొడుతుండగా చూడలేదు. పైగా ఇంకో మాస్టారు కొడుతూంటే పరుగెత్తుకుంటూ వెళ్ళి వాణ్ణి ఇవతలకు లాక్కొచ్చేసి వాడికి రానిదేదో చెప్పి పంపించేవారు.

మాస్టారు సంపాదన చాలేదికాదు. అయినా పిల్లలకు ఏమీ లోపం రాకుండా చూచేవారాయన. గోపిని పెద్దచదువు చదివించాలని కోరిక. మరుసటి సంవత్సరమే హైస్కూలులో చేరాల్సిన గోపి ఒకరోజంతా ఇంటికి రాలేదు. ఎక్కడికెళ్ళాడో వస్తాడుగదా అని మాస్టారు ఊరుకున్నారు. రెండురోజులు గడిచాయి. ఇంతలో ఇంకో విషయం తెలిసింది. ఊళ్ళో పెద్దరెడ్డిగారబ్బాయి, గోపి కలిసి పక్క ఊళ్ళో తిరణాల కెళ్ళటానికి టిక్కెట్టు లేకుండా రైలెక్కారు. కాని అది మెయిలు కావటంతో వీళ్ళు దిగాల్సిన స్టేషనులో ఆగలేదు. ఆగిన స్టేషనులో ఆ అబ్బాయి దిగేశాట్ట. గోపి అతనికి కనబడలేదట. అతను మాత్రం వచ్చేశాడట. గోపి విషయం ప్రతిపేపర్లోను వేయించారు. కాని ఆచూకీ దొరకలేదు. మాస్టారిగుండె వ్రక్కలయింది. ఎన్నో ఆశలు పెట్టుకున్న గోపి గురించి ఆయన ఆలోచిస్తుండేవాడు. ఆయన మొగంమీద ఆ తర్వాత నేను నవ్వే చూడలేదు. బడికి వెళ్ళేవారు; వచ్చేవారు. ఎవరి సంగతి పట్టించుకునేవారుకాదు. ఊళ్ళో అందరూ 'పాపం!' అనుకునేవారు మాష్టార్నిచూచి నప్పుడల్లా. పదకొండేళ్ళకి నేను, నిర్మలా ఐదో తరగతి ప్యాసయ్యాము. నిర్మల-చెల్లెలు మల్లి నాలుగోతరగతి చదువుతుండేది.

ఆ తరువాత కొన్ని కారణాలవల్ల నిర్మలకు దూరమయి, నాన్న వాళ్ళతో వెళ్ళిపోయాను. ఆరేళ్ళవరకూ మళ్ళీ ఆ ఊరు వెళ్ళలేదు. అప్పటికి నేను ఎస్సెల్సీ పూర్తిచేశాను. ఊరికి వెళ్ళటంతోటే నిర్మల—వాళ్ళింటికి వెళ్ళాను. మాస్టారు వాకిట్లో కనబడ్డారు. చాల చిక్కిపోయారు. మొహంలో కళ అవుపించలేదు.

ఆయనే పల్కరించారు: "నిర్మల స్నానం చేస్తూంది; వస్తుంది; కూచోమ్మా" అన్నారు.

నేను కూర్చుంటూ చుట్టూ చూశాను. ఇల్లు బాగా పాతబడిపోయింది. ఒక గోడమీద గోపి ఫోటో కనిపించింది. చిన్నప్పుడు ఊళ్ళోకి పావలాకు ఫోటో తీసేవాడు వచ్చినప్పుడు గోపి పావలా సంపాయించి తీయించుకున్న ఫోటో అది. బిళ్ళంగోడి తగిలి కంటిమీద పడ్డ మచ్చ స్పష్టముగా కనిపిస్తోంది. మాస్టారు బయటికి వెళ్తూ ఫోటో దగ్గర కాసేపు ఆగి వెళ్ళటం గమనించాను. నా కళ్ళు చెమర్చాయి.

ఇంతలోకే నిర్మల వచ్చింది. అప్పుడే స్నానంచేసి తెల్లచీర కట్టుకుంది. మనిషి చక్కని కుందనపు బొమ్మలా ఉంది. నాకే ఆశ్చర్య మేసింది. నిర్మలే పల్కరించింది. ఆరేళ్ళ తర్వాత కలిశాం కదా. గంటల తరబడి మాట్లాడుకున్నాం. మాటల్లో తెలిసింది, నిర్మల కూడా ఆరోఫారం పాసయిందనీ, వాళ్ళ నాన్న గోపిని గురించి ఎంత ఆలోచించేదీ, ఆయన సంపాదన ఎలా చాలనిదీ, తను ఇతరుల సాయంతో చదువు ఎలా పూర్తిచేసింది అంతా ఓపిగ్గా చెప్పింది. నిర్మలస్థానంలో నన్ను ఊహించలేకపోయాను.

తరువాత నిర్మలదగ్గరినుంచి అప్పుడప్పుడు ఉత్తరాలు వచ్చేవి. ఒకరోజు వ్రాసిన ఉత్తరంలో

'శ్యామలా!

మా మల్లి—పెళ్ళి వారంరోజుల్లో; వాళ్ళు చెల్లెల్ని చేసుకొంటామన్నారు. నాన్నగారి స్నేహితులు ఒకరు కుదిర్చారా సంబంధాన్ని. కట్నంకోసం ఉన్నఇల్లు, నేల అమ్మేశాం. నిన్ను పిలవలేదంటావేమో. మాకే సరిగా పిలుపు లేదు శ్యామలా. నీకేం రాయమంటావు? నాన్నగారు నా పెళ్ళి గురించి బాధపడుతున్నారు శ్యామలా. నేను మల్లిపెళ్ళికి మనస్ఫూర్తిగా ఒప్పుకున్నాను. నా కెలాగూ సుఖపడే రాత లేదు. కనీసం నా చెల్లిఅన్నా సుఖపడుతుందిగదా? నీ క్షేమం వ్రాస్తావుగదూ.

నీ నిర్మల.'

అంటూ వ్రాసింది. నేను వెంటనే ఉత్తరం వ్రాశాను. కాని మళ్ళీ జవాబురాలేదు. చెల్లెలు—పెళ్ళి తన పెళ్ళికిముందే చూడాల్సొచ్చింది. నిర్మల స్థితికి నాకు దుఃఖం వచ్చింది. తెలిసో తెలియకో గోపి వెళ్ళిపోయాడు. ఏమీ చెయ్యలేక మల్లి నిష్క్రమించింది. ముసలి తండ్రి—భారం నిస్సహాయురాలు మీద పడింది. మరి మాస్టారు ఆ బాధ ఎలా భరిస్తున్నారో. మాస్టారు బాధపడటంతప్ప ఏమీ చెయ్యలేరు. నిర్మల అమ్మలక్కల మాటలు ఎలా భరిస్తుందో. తనకు పెళ్ళిచేయమని నిర్మల తండ్రి నడగలేదుగదా! అలాగని స్వతంత్రించేంతటి ధీరురాలుకాదు. తండ్రి తన కూతుర్ని ఉద్యోగం చేయుమనలేడుగా. మరి ఇల్లుకూడా లేకపోయాక ఎక్కడ కెళ్ళారో ఏమయ్యారో తెలియదండి. ఇన్నాళ్ళకి ఈశుభవార్త వింటానని నే ననుకోలేదు. ఇటు వంటప్పుడు తప్పకుండా వెళ్దామండి." ఆశగా చూశాను.

"నిజమే శ్యామలా! నిర్మల—పెళ్ళి నేనుకూడా చూడాలి." నవ్వుతూ అన్నారు.

మర్నాడు పోస్టులో శుభలేఖ వచ్చింది. నాకు అందించబోయి త్రిప్పిచూశాడు పోస్టుమన్. ఆశ్చర్యపోయాడు.

"క్షమించండి! ఈ నిర్మల ఎవరండి" అన్నాడు ఆత్రంతో

"నా స్నేహితురాలు" ఈ వివరాలు నీ కెందుకన్నట్టు చూశాను.

"వీళ్ళఊరు?" మా ఊరే ఫలానా అనిచెప్పాను. అతని ముఖం సంతోషంతో వికసించింది. "నిర్మల మాస్టారుగారి అమ్మాయిగదూ, మీరూ ఆమె కలిసి

—41 వ పేజీ చూడండి

# గు లా బి

నున్న సత్యప్రసాదరావు.

ఎఱ్ఱని గులాబి
తియ్యని జిలేబి
గులాబి వాసనే
జిలేబి వాసన.

మగువల మనసులో
మమత గొలిపే పువ్వు
మన్మధుని వింటికే
మురుపునిచ్చే పువ్వు.

వయ్యారి జడలోన
శయనించు పువ్వు
హరిదాసు మెడలోన
నాట్యమాడే పువ్వు.

పున్నమి రేయిలో
తారకల తళతళలో
పరిమళమ్మును చిమ్మి
పరవశింపగ జేయు.

కవుల డెందములలో
కదలు భావమ్ము
కంజజుని సృష్టికే
గర్వ కారణము.

సకల లోకమ్ములకు
సమ్మోహనాస్త్రమా!
రస జగత్తున కెల్ల
రాణివో యేమో!



# శ్రీదేవి

రంగధామ్

## జరిగిన కథ

దుర్గాప్రసాద్, విశ్వేశ్వరరావు కుమారుడు; భార్య అనసూయమ్మను హింసిస్తూ ఉంటాడు. దుర్గాప్రసాద్ కుమార్తె శ్రీదేవి జగన్నాథం వద్ద సంగీతం నేర్చుకుంటూ ఉంటుంది. సంపన్న కుటుంబికుడే అయినా దుర్గాప్రసాద్ పిల్లలను, భార్యను ఉపేక్షించి, త్రాగుడూ, స్త్రీలోలతలకు అలవడతాడు. విశ్వేశ్వరావుగారి విధవప్ప చెల్లెలు సుభద్రమ్మ అనే ఆమెతో శ్రీదేవికి అని పరిచయం అవుతుంది. అక్కడ శ్రీదేవికి ఆమె మరిది వేణుతో పరిచయమై, అతనంటె ఆకర్షణ ఏర్పడుతుంది. శ్రీదేవికి, శ్యామల, సావిత్రి అనేవారు ఆత్మీయులౌతారు. కాలేజీ విద్యార్థిని నళిని వేణువుని ప్రేమిస్తుంది. వేణూ శ్రీదేవీ, పారిపోయి వివాహం చేసుకుంటారు. మోజుతీరిన వేణు శ్రీదేవిని నిరాదరిస్తాడు. సావిత్రి శ్రీదేవి నోదారుస్తుంది. శ్రీదేవి పుట్టింటినుండి డబ్బు తెప్పించలేదనే కోపంతో వేణు ఇల్లువదలిపోతాడు. శ్రీదేవికి సరస్వతీ బాయ్, సుందరమ్మ, శారద, మీనాక్షమ్మ అనే స్త్రీలతో పరిచయమౌతుంది. ట్రెక్కు పైన్ వేటుగాకట్టి ఉత్తీర్ణురాలౌతుంది.

(గత సంచిక తరువాయి)

తల్లితోను, జయమ్మతోను చెప్పి, శ్రీదేవి మేడ మీద తన గదిలోకి వెళ్ళిపోయింది. ఆమెకు చాలా సంతోషంగా ఉంది. తన పక్కన, రజనిని కూచో పెట్టుకుని, వాడి కర్థం కాకపోయినా తను పాస య్యానని చెప్తూ, వాడిని కొన్ని వందలసార్లు ముద్దుపెట్టుకుంది. రజనికి ఏడాది దాటింది. వాడు తనకేదో అర్థమైనట్లు నవ్వసాగాడు. మొట్టమొదటిసారిగా శ్రీదేవికి ఆత్మవిశ్వాసం కలిగినట్లయింది ఈ పరీక్ష పాసవడంతో.

తను ఎందుకు పనికిరాని వ్యర్థజీవి కాదనీ, తనకు కూడా తెలివితేటలూ, సమర్థతా ఉన్నాయనీ, తను కూడా అవసరమైతే సంఘానికి ఉపకరించగలననీ, అంతేకాక తన కాళ్ళమీద తను నిలబడగలననీ—ఒక విధమైన ధైర్యం కలుగజేస్తుంది—విద్య—ప్రతి వ్యక్తికీ. అది స్త్రీకి చాలా అవసరం. పురుషుడు తనను పోషిస్తేనే గాని వేరే గతి లేదనుకునే స్త్రీకి, ఆ ధైర్యం ఉండదు. ఆమెలో ఎన్ని మంచి గుణాలున్నా, ఎంత తెలివితేటలున్నా బయట ప్రపంచం గుర్తించదు. ఆమెకు ఆమె ఇంట్లో తప్ప, బయటకు వస్తే స్థానం ఉండదు. అందుకని పురుషుని విలాస వస్తువుగా, పిల్లల్ని కనే యంత్రంలా ఆమె జీవిస్తుంది. అదే విద్య గల స్త్రీ యైతే, సంఘంలో తాను కూడా ఒక ప్రత్యేక స్థానం సంపాదించుకోగలదు. తక్కిన సంగతు లెలా ఉన్నా, ఈ నవనాగరిక ప్రపంచంలో స్త్రీకి ఆమాత్రం, ఆత్మవిశ్వాసం అవసరం. శ్రీదేవికి పరీక్ష పాసయ్యానన్న సంతోషంలో, ఈ భావాలన్నీ కలిగాయి. న్యాయానికి మెట్రిక్, చాలా చిన్న పరీక్ష! అయినా అది మొదటి మెట్టు! అది పాసయినా, తన కొక స్థానం సంపాదించుకోగల శక్తి స్త్రీకి వస్తుంది. విద్య ఉన్న స్త్రీని భర్త కూడా గౌరవంతో చూస్తాడు. పిల్లలు కూడా గౌరవంగా చూస్తారు. ఇన్నాళ్ళూ తన కొడుకు—రజని భవిష్యత్తు ఎలా ఉంటుందో అని బెంగపెట్టుకునే శ్రీదేవికి, ఆఖరికి తనొక చిన్న ఉద్యోగం చేసైనా, తననీ, తన బిడ్డనీ పోషించుకోగలననీ, రజని గురించి తను బెంగ పెట్టుకోనక్కరలేదనీ అనిపించింది. 'తను ఇంకా పెద్ద పెద్ద చదువులు చదువుతుంది! రజనినెంతో బాగా పెంచుతుంది!' అని ఎన్నో ఊహాగానాలు చేసిందామె.

అంత సంతోష సమయంలోనూ శ్రీదేవికి, విపరీతమైన విచారం కలిగించిన వార్త, సావిత్రి మరణవార్త. ఆనాటి మధ్యాహ్నమే, సావిత్రి—ఇంటికి పని మనిషిని పంపి, ఆమె కెలాగుందో కనుక్కోవాలని శ్రీదేవి ప్రయత్నించింది. కానీ వెళ్ళిన మనిషి, ఆరోజు ప్రొద్దున్నే మదనపల్లినుంచి, సావిత్రి—తల్లిదండ్రులు తిరిగి వచ్చారనీ, సావిత్రి రెండు రోజులకు పూర్వమే మదనపల్లిలో మరణించిందనీ, వార్త తెచ్చింది.

వెంటనే శ్రీదేవి, సావిత్రి—ఇంటికి వెళ్ళి, ఆమె తల్లితండ్రులను పరామర్శించి వచ్చింది. సావిత్రిని తల్చుకొని శ్రీదేవి చాలాసేపు విచారించింది. తనకు ఎంతో సాయం చేసిన వ్యక్తి, తను పరీక్ష పాసయిందంటే అందరికన్నా ఎక్కువగా సంతోషించే వ్యక్తి మరణించింది. ఆఖరి క్షణందాకా ఆమె మనసులో నున్న బాధ ఎవరికీ తెలియదు. ఎంత లోతు గుండె! పైకి ఎంత చిలిపిదానిలా కన్పించేది! ఎప్పుడూ, ఏదో హాస్యమాడుతూ, వేళాకోళం చేస్తూ, కవ్విస్తూ, నవ్విస్తూ ఉండేది. ప్రేమించిన వ్యక్తికోసం అంత బాధపడిన దెన్నడెవరికీ, ఏనాడూ తెలియనివ్వలేదు. స్త్రీ—హృదయం అంటే అదేనా? తన బాధను తనలోనే అణుచుకోవాలా? తను పొందే అవమానాలూ, కష్టాలూ, బాధలూ, తనలోనే అణిచేసుకుని, పైకి మామూలుగా సంచరించాలా? శారద జీవితం అదేనా? భర్త తన్నెంత నిర్దాక్షిణ్యంగా చూచినా, కిక్కురుమనకుండా సహించి అతని కుపచారాలు చేస్తుంది. సుందరమ్మ, అంత సౌందర్యం, అంత తెలివితేటలూ, నిగ్రహశక్తీ, అన్నీ వ్యర్థమై, మోడువారిన వైధవ్య జీవితం గడుపుతుంది అది ఆమెకుబాధ కలిగించదా? కాని తన బాధను చెప్పుకునే హక్కయినా ఆమెకుందా?

సంఘం—దృష్టిలో స్త్రీ అన్నీ సహించాల్సిందే. బాధపడడానికి వీల్లేదు. ఆమె బాధను, బాధగా సంఘం గుర్తించదు. అది ఆమె కర్మ! ఎందుకు పని కొచ్చినా, పనికి రాకపోయినా, వేదాంతం, స్త్రీని అణిచెయ్యడానికి బాగా పనికొచ్చింది. హృదయంలో హాలాహలం విజృంభిస్తున్నా, వదనంలో అమృత దరహాసం, స్త్రీ చూపించాలి. ఆవిధంగా, ధర్మం, సాంప్రదాయం స్త్రీని తయారుచేసింది. తన బాధను వ్యక్తంచేసే శక్తి స్త్రీలో న్యూగ్యమైంది. సావిత్రి అటువంటి మహానాప్ని ప్రదర్శించి, చివరకు ప్రాణానికే ముప్పం తెచ్చుకుంది. బహుశా చాలామంది స్త్రీల జీవితాలు, అంతులేని సహన ప్రదర్శనతో అంతిమ ఘడియల్ని అత్యంత వేగంతో సమీపిస్తుంటాయేమో!

శ్రీదేవి ఈ ఆలోచనలతో చాలా బాధపడింది. తన బాధను మరునాడు శారదా, సుందరమ్మలతో పంచుకొని కొంత ఉపశాంతి పొందింది. సుందరమ్మ కొంత వేదాంతం బోధించింది శ్రీదేవికి. భగవద్భక్తి నలవర్చుకోవాలని చెప్పింది. మనస్సును సరియైన మార్గంలో పోనివ్వడానికి, ఐహిక దుఃఖాలు మర్చిపోవడానికీ, భగవత్ప్రార్థనే ఉత్తమ పద్ధతి యని చెప్పింది. శ్రీదేవికి ఆమె మాటలు నచ్చాయి. కాని ఆమెకు మానవజీవితంలో

భగవంతుడు తోడ్పడతాడంటే ఎక్కువ నమ్మకం లేదు. తరువాత శ్రీదేవి — భవిష్యత్తు గురించి వారు చర్చించారు. శ్రీదేవి, "నన్ను, మా తాతయ్య, మెట్రిక్‌కు ఎలాగో కట్టనిచ్చారు కాని, ఇక పై చదువు చదవనిస్తారని తోచదు" అంది.

శారద "గట్టిగా పట్టుబడ్తే చదవనిస్తారను కుంటాను" అంది.

"తప్పక చదవాలి. అయినా ఈ రోజుల్లో స్త్రీలు కాలేజీ—విద్య నభ్యసించటం విడ్డూరమేమీ లేదు. అందుకు వారు అభ్యంతరం చెప్పకూడదు" అంది సుందరమ్మ.

"కాలేజీ ఈ ఊళ్ళోనే ఉంది కాబట్టి, ఎలాగైనా వారిని ఒప్పించగల ధైర్యం నాకుంది. కాని మా తాతయ్యగారివన్నీ పాతకాలపు ఊహాలు. ఆడవాళ్ళు బయటికి వెళ్ళకూడ దంటారు. ఇంట్లో కూడా నేను ఆయన ముందు ఎక్కువగా తిరగం."

"ఆ రోజులు పోయాయి. ఆడది ఇంట్లోనే కూచుంటే, మగవాడు సంపాదించింది చాలని రోజులు వచ్చాయి. మన మధ్యతరగతి కుటుంబాలలో, ఖర్చు ఎక్కువా; రాబడి తక్కువా, కనిపిస్తోంది. అందుకని భర్తతోబాటు భార్య కూడా సంపాదించాలి. ఆడది పైకి రాకుండా జరగదు" అంది శారద.

"అదేమిటో, ఆడది కాస్త స్వేచ్ఛగా తిరిగినంత మాత్రాన 'ఆమె చెడ్డది'—అనే అభిప్రాయానికి ఇట్టే వస్తారు మగవాళ్ళు. ఏ వ్యక్తి ఎలాటిది ? అని కూడా విమర్శించరు" అంది శ్రీదేవి.

"దానికి కారణం, 'ఆడదాన్ని ఎలాగైనా అధః పతనం చెయ్యాలి' అని పురుషుడు కోరడమే. ఒక స్త్రీ కొద్దిగా స్వేఛ్ఛతో గాని, స్వతంత్రాలోచనతో గాని బ్రతకాలని చూస్తే, చుట్టూ ఉన్న పురుషులు, ఆమె కనేక విషమ పరిస్థితులు కల్పిస్తారు. వాటికేమాత్రం తట్టుకోలేని ఏ స్త్రీయైనా పతనమై పోతుంది. నా వివాహం చాలా చిన్న వయస్సులో జరిగింది. అప్పటికి నాకు పదేళ్ళు. మా పుట్టింటివాళ్ళు చాలా బీదవాళ్ళు. మా అత్తవారు చాలా భాగ్యవంతులు. మా అత్తగారికి ఒక్కరే సంతానం. ఆమె నన్ను చాలా ప్రేమగానూ చూశారు; మళ్ళీ చాలా కఠినంగానూ ఉండేవారు. నేను, నా పదమూడవ సంవత్సరంలో కాపురానికి వెళ్ళాను. నేను వెళ్ళిన రెండేళ్ళలో మా అత్తగారు చనిపోయారు. అప్పటికే నా భర్త వంట్లో బాగులేదు. ఆయన శరీర పరిస్థితి కూడా చాలా చెడుగా ఉంది. మా అత్తగారు చనిపోయే ముందు ఆరు నెలలు మంచంమీదనుంచి లేవలేదు. ఆమెకు నేను తప్ప మరెవ్వరు చాకిరీ చేసినా, పనికి రాదు. ఇరవైనాలుగు గంటలూ ఆమెకు సేవ చేసేదాన్ని. ఆమె చనిపోయాక, మావారి రోగం ముదరడం, ఆయన చికిత్స నిమిత్తం మేము అనేక ఊళ్ళు తిరగటం జరిగింది. ఆరు నెలల్లో పన్నెండువేలు ఖర్చయింది. నేను, నా ఒళ్ళెరుగకుండా ఆయనకు సేవ చేశాను. రాత్రిపూట చిన్న కునుకైనా తీయకుండా, ఆయనకు ఏం కావాలో కనుక్కుంటూ నిలబడేదాన్ని. ఆయన కింక అంత్య ఘడియలు సమీపించేసరికి, ఆయనే లాయర్ని పిలిపించి, ఆస్తంతా నా పేర రాయించి, ఆ వీలునామాను అమలుజరుపవలసిన అధికారిగా, మాకు దూరపుచుట్టమైన రాజయ్యగారినే ఆయనను నియమించారు. నా భర్త పోయేసరికి నా వయస్సు పదహారు సంవత్సరాలు" అని ఆగింది సుందరమ్మ.

"అబ్బా !" అన్నారు శ్రీదేవి, శారదానూ.

"అప్పటినుంచి నేను అయిదేళ్ళు వద్ద అవ

39-వ పేజీ చూడండి



### గ్రహస్థితి

కర్కాటకంలో కుజ రాహువులు; మకరంలో శని కేతువులు; మకర కుంభాలలో శుక్రుడు; కుంభ మీనాలలో బుధుడు; మీనంలో సూర్య గురువులు; మకర కుంభ మీన మేషాలలో చంద్రుడు.

**మేషం :**

**(అశ్విని, భరణి, కృత్తిక 1 పా.)**

ప్రస్తుతం మీ ఆలోచనలు చురుకుగా తెమలవు. ఆదాయం మామూలుగా ఉంటుంది. ఒక సమయంలో ఉన్న ఉత్సాహం మరొక సమయంలో కనుపించదు. కుటుంబ విషయాలలో చిన్న చిన్న గొడవలు వస్తూ ఉండటంవల్ల మనస్సు ప్రశాంతంగా ఉండదు. అధికారులతో కూడా భిన్నాభిప్రాయాలు రాతగిన సమయం. జాగ్రత్తగా ఉండండి. వృత్తిలో ముందుకన్నా శ్రమ అధికం. సంతోషవార్తలు తెలుస్తవి. హాస్యంతో ఆరంభం అయిన మాటలు కలహంగా మారే అవకాశాలున్నవి. వారాంతంలో నిరుపయోగమైన పనులు చేస్తారు. ప్రయాణాలు చేయవలసివస్తుంది. బాహ్య గౌరవం, ఆడంబరము ఎక్కువ.

* * *

**వృషభం :**

**(కృత్తిక 2, 3, 4 పా, రోహిణి, మృగశిర 1, 2 పా.)**

మీరు ఎవరి సహాయం కోసం ఎదురు చూస్తారో




## దైవజ్ఞ పాతూరి శ్రీరామమూర్తి

**22-3-1963 శుక్రవారము మొదలు**

**28-3-1963 గురువారము వరకు**

వారే మరొకరి మీద ఆధారపడే సమయం. పిల్లల ఆరోగ్యం గురించి జాగ్రత్తగా ఉండండి. సాధారణంగా, మీ పనులు ఏవీ భంగం కావు. అయితే ఆలస్యం మాత్రం ఉంటుంది. వృత్తిలో క్రొత్త వారి చేరికవల్ల కాని, క్రొత్త పద్ధతులను అనుసరించటంవల్ల కాని, విశేషంగా ఫలితం పొందగలుగుతారు. అధికారము, పేరు ప్రతిష్ఠలు పెరుగుతవి. విద్యా సంబంధమైన కృషికి మంచి అవకాశాలు లభిస్తవి. మిమ్ములను విరసించినవారు ఈ సమయంలో మీతో బాగా కలుస్తారు. విలువగల వస్తువులు కొంటారు. స్థిరాస్తులను కొనే ప్రయత్నాలు, గృహ నిర్మాణ ప్రయత్నాలు కలిసి రాగల అవకాశాలున్నవి. 23, 24 తేదులలో శుభవార్తలు.

* * *

**మిధునం :**

**(మృగశిర 3, 4 పా, ఆరుద్ర, పునర్వసు 1, 2, 3 పా.)**

కొన్ని సందర్భాలలో మీ జాగ్రత్త ఉపయోగించకపోవచ్చు. కాని, నిరుత్సాహ పడవద్దు. ముఖ్యముగా, రహస్యంగాను, నిరాడంబరంతోను పనులు సాగించవలసిన సమయం. 24 తరువాత మీరు ఎదురుచూస్తున్న వార్తలు తెలుస్తవి. ఈ వారంలో మీకు అందవలసిన ధనం కూడా కొంత ఆలస్యంగానే లభిస్తుంది. వ్యావహారిక విషయాలలో చెప్పుకోతగిన అనుకూలత అనేది ఉండదు. వృత్తి, ధనార్జన మొదలయిన వాటిమీద మనస్సును నిలువ

### ఈ వారము ధరలు

వేరుశనగపప్పు ధర వారం రెండవభాగంలో పెరుగుతుంది. నూనె ధర కూడా కొద్దిగా పెరుగుతుంది. నూవుల ధర మందీలో నిలుస్తుంది. వారాంతంలో కొద్దిగా పెరుగుతుంది. కందుల ధర వారం మొదటి భాగంలో మందీ, రెండవ భాగంలో తేజీ సూచనలు. చింతపండు, బెల్లము—వీటి ధర మందీ అవుతుంది.

లేక పోతారు. వినోద కార్యక్రమాలయందు ఆసక్తి పెరుగుతుంది. సౌఖ్యంనిమిత్తం అధికంగా, ధన వ్యయం చేస్తారు. 27, 28 తేదులలో సంఘంలో గౌరవం, కార్యసిద్ధి.

* * *

**కర్కాటకం :**

**(పునర్వసు 4 పా, పుష్యమి, ఆశ్లేష.)**

న్యాయం పలికి, విరోధాలు తెచ్చుకోవలసిన పరిస్థితులు ఏర్పడుతవి. తటస్థంగా ఉందామనుకున్నా, వీలుకాదు. వృత్తి ఉద్యోగాది విషయాలలో పరీక్షలవంటి సమస్యలు ఎదురుపడుతున్నా ధైర్యంతో నిగ్రహించ గలుగుతారు. పదిమందిలో గౌరవం, ధనాదాయం బాగుంటవి. మనస్సు మాత్రం ఉద్రేకపూరితంగా ఉంటుంది. మాటలోను, వ్రాతలలోను తొందర—పడవద్దు. కుటుంబ ఖర్చులు ముందుకన్నా పెరుగుతవి. దైవకార్యాలకు అభ్యంతరాలు రాగల అవకాశా లున్నవి. అలంకార వస్తువుల నిమిత్తం, విలాసాల నిమిత్తం విశేషంగా, ధన వ్యయం చేస్తారు. ధన విషయంలో తొందరపడి ఇతరులను నమ్మవద్దు. శ్రమకరమైన ప్రయాణాలు.

* * *

**సింహం :**

**(మఖ, పుబ్బ, ఉత్తర 1 పా.)**

ఈ సమయంలో మీ సంకల్పం ఏదీ వృధాకాదు. పట్టుదలతో కృషిచేయటం అవసరం. శారీరకంగా శ్రమపడవలసి ఉంటుంది. సంఘంలో మాట చలామణి అవుతుంది. వృత్తిలో శక్తికి మించిన భారం పైన వేసుకున్నామనే భావం తోస్తుంది కాని, దైవబలం కలిసివచ్చి అన్ని రంగాలలోను సకాలంలో ఫలితం పొందగలుగుతారు. ఇతరుల పేచీలలో కలుగజేసికొనటం, ముందుగా వాగ్దానాలు చేయటం మొదలయిన వాటివల్ల మాత్రం చిక్కుపడే అవకాశాలున్నవి. ముందుకన్నా ఆదాయం తగ్గినట్లు తోస్తుంది. అకస్మాత్తుగా దేహబాధలు కలుగగల అవకాశాలున్నవి. సాహసం పనికిరాదు.

* * *

**కన్య :**

**(ఉత్తర 2,3,4 పా, హస్త, చిత్త 1, 2 పా.)**

అన్ని హంగులు ఉంటవి. కాని, ఉపయోగం తక్కువ. ఒక పని చురుకుగా అయితే, దానికి సంబంధించిన మరొక పనికోసం కాచుకొనవలసి వస్తుంది. ప్రయాణాలు చేస్తారు. రావలసిన ధనం వెంట వెంటనే కలసి రాదు. కుటుంబంలో స్వల్ప విషయాలమీద తర్జన భర్జనలు వస్తూ సమసిపోతూ ఉంటవి. తొందరపడి ఏ పని జరిపినా తరువాత పశ్చాత్తాప పడవలసివస్తుంది. ఈ వారములో సంతోషవార్తలు, కష్టవార్తలు కూడా తెలుస్తవి. ధనాదాయం బాగుంటుంది. అధికారుల వల్ల మాట రాకుండా చూచుకొనండి. విద్యార్థులు జాగ్రత్తగా ఉండటం అవసరం. క్రొత్త వ్యాపారాలు మొదలయినవి ఆరంభించే సందర్భాలలో అంచనాలు, మదింపులు వేయటంలో జాగ్రత్తగా ఉండవలసిన సమయం.

* * *

**తుల :**

**(చిత్త 3, 4 పాదాలు, స్వాతి, విశాఖ, 1, 2, 3 పాదాలు)**

ఈ సమయంలో మీ బుద్ధి చురుకుగా పనిచేయగలదు. బంధు మిత్రులను చల్లగా ఆకర్షించ గలుగుతారు. వ్యవహార సందర్భాలలో కూడా ప్రత్యర్థులు తొలగిపోతారు. ధన విషయంలో అప్పుడప్పుడు చిక్కు పరిస్థితులు ఏర్పడుతున్నా, సర్దుబాటు చేసుకుంటూ ముందుకు పోగలుగుతారు. రాజకీయాలలో కూడా పేరు ప్రసిద్ధులు లభించగల సమయం. ఒక సమయంలో అపవాదులు రానున్నట్లు తెలుస్తుంది. కాని, అటువంటిది ఏమీ ఉండదు. వృత్తికి సంబంధించిన పనుల వత్తిడి అధికం. అయితే తగినంత ఫలితం లభిస్తుంది. సంతోష కార్యాలు జరుగుతవి. 26, 27 తేదులలో గౌరవం. అకాల భోజనం.

* * *

**వృశ్చికం :**

**(విశాఖ 4—వ పాదం, అనూరాధ, జ్యేష్ఠ.)**

ఇతరుల మాటలను లెక్కచేయవద్దు. ఇంతకు ముందు ఎదురు తిరిగిన పనులను తిరిగి సాగించటానికి ఉత్సాహం కలుగుతుంది. అధికారులతో స్నేహం లభిస్తుంది. ఆస్తులమీద గాని, బండ్లు, వాహనాలు మొదలయిన వాటిమీద గాని, ఎక్కువ ధనాన్ని వినియోగించవలసి వస్తుంది. వృత్తి ఉద్యోగాలలో ప్రోత్సాహకరమైన మార్పులు వస్తవి. ఇంతకుముందు మీ మాటను నిరసన భావంతో చూస్తున్న వారివల్ల గౌరవము, కార్యసిద్ధి కలుగుతవి. మీ ఆరోగ్యంలో కొద్దిగా లోపం కనిపించవచ్చు. కాని విశేష బాధలు ఉండవు. 23, 24 తేదులలో రావలసిన ధనం వస్తుంది. బంధు దర్శనం.

* * *

**ధనుస్సు :**

**మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా.)**

అన్ని విషయాలలోను సహనం చూప గలుగుతారు. కోర్టు కచేరీలలో తలవని తలంపుగా మంచి మార్పులు లభిస్తవి. పిల్లల మూలంగా ఆనందం లభిస్తుంది. చురుకుగా జరుగుచున్న పనులలో అకస్మాత్తుగా ఆటంకాలు రావచ్చు. అందువల్ల ముందు — ముందు మీకు అనుకూలత ఉంటుంది. పూర్తిగా సమాచారం తెలుసుకోకుండా ఏ పనిలోను ప్రవేశించవద్దు. వారం రెండవ భాగంలో దూరపు ప్రయాణం చేయవలసివస్తుంది. యుక్తితో ఎదుటివారి మనస్సుకు నొప్పి తగలకుండా చూచుకొనండి. కుటుంబంలోనివారి ఆరోగ్యం సరిగా ఉండదు. సుఖ సంతోషాల నిమిత్తం ధన వ్యయం.

* * *

**మకరం :**

**(ఉత్తరాషాఢ 2, 3, 4 పా, శ్రవణం, ధనిష్ఠ 1, 2 పా)**

ఈ వారం మొత్తంమీద నిరుత్సాహ వాతావరణం కనుపిస్తూ ఉంటుంది. ప్రతివారు మిమ్ములను తబ్బిబ్బు చేస్తారు. అయితే క్రియా కలాపాలలో ఫలితం కొంతవరకు లభిస్తుంది. ముందుగా ఖర్చులు ఎదురు చూస్తుండటంవల్ల ఆర్థిక లోపాన్ని ఎదుర్కొనవలసివస్తుంది. వ్యవహార రంగంలో అనుకూల లక్షణాలు బాగుంటవి. మీ మాట విలువతో, తోటివారికి మేలు చేయగలుగుతారు. మిమ్ములను ఒకప్పుడు భయపెట్టిన కారణాలు దైవానుగ్రహంవల్ల పూర్తిగా తొలగిపోతవి. వారాంతంలో మంచి మార్పులకు అవకాశం ఉన్నది. మీ ఆరోగ్యం కూడా బాగుంటుంది.

* * *

**కుంభం :**

**(ధనిష్ఠ 3, 4 పా, శతభిషం, పూ. భాద్ర 1, 2, 3 పా.)**

ధన, కుటుంబ విషయాలలో ఒక విధంగా సంతృప్తి కనుపిస్తుంది. సాహస కార్యాలలో ప్రవేశించి, విశేషంగా ధనం వినియోగించ గలుగుతారు. సంఘంలో పదిమందివల్ల గౌరవం పొందటమే కాకుండా న్యాయము, ధర్మము — వీటి నిమిత్తం పాటు పడగలుగుతారు. ధైర్యంతో మీ అంతస్థును నిలబెట్టుకుంటారు. దక్షిణ దిక్కునుంచి సంతోష వార్తలు వింటారు. విందులు, వినోదాలు మొదలయిన వాటిలో కాలం గడుపుతారు. ప్రయాణాలు చాలా హాయిగా జరుగుతవి. అకస్మాత్తుగా దెబ్బ, లేక గాయము మొదలయినవానివల్ల బాధ కలిగే అవకాశాలున్నవి.

* * *

**మీనం :**

**(పూ. భాద్ర 4 పా, ఉ. భాద్ర, రేవతి.)**

ఈ సమయంలో ఎవ్వరి గురించి ఏమీ అనుకొనటానికి అవకాశం ఉండదు. పైకి మాత్రం మంచిగా నటిస్తూ ఉంటారు. మీ కోపాన్ని అణచుకొని, ఏదో విధంగా పనులు సాధించుకొనటం ముఖ్యం. ఇతరుల ఇండ్లలో పెత్తనం వహించవలసిన అవసరాలు ఏర్పడుతవి. మనస్సు ఏ ఒక్క కార్యంమీదా నిలుపలేకపోతారు. సాధారణంగా విశ్రాంతి — తీసుకొనటానికి ప్రయత్నించండి. పొగడ్త — మాటలను నమ్మి మోసపోకండి. ఈశ్వరారాధనవల్ల చిత్త స్థైర్యము, కార్య నిర్వహణశక్తి లభిస్తవి. వ్యవహారాలలో పట్టుదలలు

వర[illegible]గిరి ★

# మీ చర్మానికి తగినది




# నివియా

## ఇదే మీ చర్మానికి కావలసినది

నివియా క్రీమ్‌లో "యుసిరైట్" — అద్వితీయమైన, సహజ ప్రకృతి పదార్థము వంటిది ఉన్నది. రోజూ స్నానం వల్లను, ఎండ, వాన, గాలిలో తిరుగుచుండుట వల్లను కోల్పోవునట్టి మీ చర్మమందలి చమురులను అది సమకూర్చుతుంది. నివియా మీ చర్మాన్ని మృదువుగాను, యౌవనయుతమైన ఆరోగ్య వంతంగాను వుంచుతుంది. మీ చర్మానికి వాడదగినది. నివియా. ఇప్పుడే!

నివియా — వివిధోపయుక్తమైన క్రీమ్.






Aiyars C-248 -TEL

ఇండియాలో సోల్ డిస్ట్రిబ్యూటర్లు. జె. ఎల్. మారిసన్, సన్ & జోన్స్ (ఇండియా) ప్రైవేట్ లిమిటెడ్,
పోస్టుబాక్సు నెం. 1746, బొంబాయి-1

# సారాసీసా

## రియోడిజనైరో పోలీసు అధికారి: అల్ఫాన్సో మార్టినెల్లి

సాయంకాలంవరకూ—కురిసి కురిసి ఆగినవానతో తడిసిన రియోడిజనైరో రోడ్లన్నీ హత్య జరిగిన 'నాటి రాత్రి' దీపాలకాంతితో తళతళలాడుతున్నాయి. సముద్రతీరం వెంబడి లైట్ల వరస సముద్ర గాంభీర్యాన్ని—భయంకరంగా, 'నల్ల' గా చాటుతోంది. రోడ్డుకి అవతలిపక్క లైట్లు రేవుని చుట్టుకుంటూ నగరంవైపు వెళ్లాయి.

చక్కగా—చిక్కగా అలంకరించిన, హాయి నిచ్చిపుచ్చుకునే—హోటళ్ల గదుల్లోంచి, వసతిగృహాల్లోంచి, గృహాల్లోంచి—తాగి, వైమరచి అరిచే అరుపులు, పిల్లికూతల్లాంటి కేరింతలు, హాహా హీహీకారాలూ— తదనుగుణంగా గీత—సంగీత వాద్యాలూ హోరాహోరీగా వినవస్తున్నాయి. డబ్బున్న చిన్నా పెద్దా మరోసారి ఉత్సాహ పడదామని ఉబలాట పడుతున్నారు. మత్తెక్క వాసనల మధ్య మత్తెక్క సారాబుడ్లతో ఊగే లోకానికి—అదే రాత్రి జరిగిన భయంకర సంఘటన—తెలియనే తెలియదు. దీపాల కాంతికి అందీ అందనంత దూరంలో ఉన్న కొండలమీదున్న పూరిపాకల్లోంచి గుడ్డిదీపాలు మిణుకు మిణుకు మంటున్నాయి. ఉన్నట్టుండి పాకలోంచి 'నువ్వెంతంటే నువ్వెంత' నే తరహా అరుపులూ, పోట్లాటలూ వినవచ్చాయి. ఆనక, పాకలోని దీపం గమ్మున ఆరిపోయింది. ఉత్తర క్షణంలో ఓ ఆకారం—రివ్వున రోడ్డుమీదికి వచ్చి—చీకట్లో అంతర్ధానమయిపోయింది. అలాంటి పూరిపాకల్లో ఉండే వాళ్లు ఎవరి కెవరూ కావలా ఉండరు; ఉండలేరు గనుక—హత్యలాటిది జరిగితే—కేవలం మూడోకంటివాడికి తెలియనంత వ్యక్తిగతంగా జరుగుతుంది.

భళ్లున తెల్లవారేసరికి హత్యా—విషయం పోలీసు స్టేషనుకు చేరింది.

చిరిగిన బట్టల నెగసందోసుకుంటూ, పరస్పరం నెట్టుకుంటూ చిన్నా పెద్దలు ఆ పాక ముందు పోగై లోపలకు వెళ్లాలని ప్రయత్నిస్తున్నారు. "చవ్. తప్పుకోండి" అన్నాను నేను—నా పరివారంతో వస్తూనే. జారే కోటును ఎగసందోసుకుంటూ ఆ కొండ ఎక్కేసరికి గుండె దడ దడ లాడింది. 'తెల్లారింది—శుభ మొదలు' అనుకున్నాను కొంచెం విసుగుతో. కాలుతున్న సగం సిగరెట్టుకేసి నిస్పృహగా చూసి, నిట్టూర్చి, దాన్ని పారేసి, వంగి, తల వంచుకుని—ఆ పాకలో ప్రవేశించాను. 'నా సిగరెట్టు పీక'—నాదంటే నాదని పిల్లలు బయట వాదులాట ప్రారంభించారు. పద్దెనిమిదేళ్లనుంచి పోలీసు — శాఖలో అనుభవం ఉండడంవల్ల—కార్యక్రమం ప్రకారం—వాతావరణాన్ని, శవం పడున్న స్థితిని జాగ్రత్తగా చూశాను.

లోగడ నేను చూసిన అనేక పాకల్లాగానే ఉందీపాక కూడా. నానాభ్రష్టా అయిపోయిన సామాన్లూ, అల్లల్లాడే టేబులు, గమ్మున తిరగబడే 'మూడు కాళ్ల'—రెండు కుర్చీలు, మూలగా దుమ్ములో పడున్న దుప్పట్లూ ఉన్నాయి. గాలీ వెలుతురు లేక నేల చితచితగా ఉంది. బజార్లలోంచి ఎత్తుకొచ్చిన సినారేకు—బోర్డులు గోడలకు వేళ్లాడుతున్నాయి.

మోకాళ్లమీద కూర్చుని, శవంకేసి పరీక్షగా చూశాను. 'ఆమె' రెండు చేతులూ రెండు పక్కలకు జాపి, వెల్లకిలా పడుంది. నెమ్మదిగా కొంచెం కదిల్చాను. ఒకానొక రోజుల్లో బాగా బతికిన స్త్రీ—నడివయస్సు దాటడంవల్ల—ముఖంమీద ముడతలు ఏర్పడ్డాయి.

లేచి, బయటికి వచ్చి పోగైన జనాన్ని చూశాను. చాలా ముఖాలు పరిచయమైనవే! వాళ్లల్లో యీ హత్యకి పనికొచ్చే విషయాలు చెప్పగలిగినవాళ్లు ఉండరు. ఒకవేళ ఉన్నా—ఏం చెబితే ఏమొస్తుందో—ఎవ రెలాపోతే మన కెందుకను కునే జాతివాళ్లంటారని తెలిసినా—అలవాటు ప్రకారం ప్రశ్నలు ప్రారంభించాను:

"మీరంతా సహకరిస్తే—యీ హత్య గమ్మున తేలిపోతుంది" అని—"ఈ అమ్మాయి పేరేమిటి ?" అన్నాను; ఎవర్నడగాలో తేలిక, గుంపు నుద్దేశిస్తూ.

"ఎల్సా" అందో కంఠం.

"పూర్తి పేరేమిటి ?"

"ఆవి డెన్నడూ చెప్పలేదు."

"సరే—ఏం పని చేస్తుంటుంది ?"

"ముష్టి"

"ఇంకా."

"మాకు తెలిసినంతవర కింకేం లేవు."

"పెళ్లయిందా."

"తెలీదు—అయ్యుంటే అతన్ని మే మెప్పుడూ చూళ్లేదు."

"ఆమెతో (యింకా) ఎవ రుంటున్నారు ?"

"ఎవరూ లేనట్టున్నారు."

"మీ కెవరికీ యింతకన్నా తెలీదా !"

"తెలిసిందంతా చెప్పాము."

ఈ రకం ప్రశ్నలూ, అవే రకం సమాధానాలూ పాత కథే. తిరిగి పాకలోకి వెళ్లాను. ఇక—రాబట్టవలసిన విషయాలేం లేవు. పూరిగుడిసెల్లో ఉండే వాళ్లయినా, హత్య చెయలేనంత అమాయకులు గారు.

ఈలోగా తన పని ముగించుకున్న డాక్టరు: "తలమీద గాయం తగిలింది—కపాలం పగిలింది—వయస్సు సుమారు నలభై అయిదేళ్లుండచ్చు—అజీర్తి వ్యాధితో బాధపడే రోగిలా ఉంది—హత్య జరిగి పది గంటలైనా అయ్యుండా" అన్నాడు క్లుప్తంగా, నా తత్వాని కనుగుణంగా.

అంటే రాత్రి పదిగంట లపుడు చంపబడి ఉంటుందన్నమాట. అదే టైములో నేనూ, మా ఆవిడా 'మిక్కీ మౌసూ' సినిమా చూస్తూ తెగానందిస్తున్నాము. మా లాగా చాలామంది ఆనందిస్తున్నారు.

"అంతేనా" అన్నాను నేను.

వెళ్లిపోతున్న అతను ఆగి, "అంతేకాదు. ఆమెకు బాగా తాగుడు కూడా అలవాటున్నట్టుంది" అన్నాడు.

"తాగుడు—భలే— మంచి అలవాటు — హత్య డబ్బుకోసం జరిగినట్టు లేదు. తాగేవాళ్లెప్పుడూ పరాయి డబ్బుతో జల్సా చేయడానికే కోరుకుంటారు." అనుకున్నాను నేను.

మరొక్కసారి గదంతా చూసేసరికి ఓ ఖాళీ సీసా నన్నాకర్షించింది. సీసా మూతిలో చూపుడు వేలు దోపి పైకెత్తి వాసన చూశాను. 'కాచకా' (చెరుకు రసంతో చేసిన చౌక—రకం సారా) వాసన గుప్పుమంది.

ఆ సీసాని జాగ్రత్తగా ఓ కాగితంలో చుట్టి ఆఖరిసారిగా పరిసరాలన్నీ చూసి, పాక దాటి, బయటికి వచ్చాను. కొండ—క్రింద అంబులెన్సు సిద్ధంగా ఉంది. సిబ్బంది శవాన్ని మోసుకెళ్లి అంబులెన్సులో పెట్టారు. జనాన్ని తప్పించుకుంటూ నేను కొండ దిగుతుంటే, "నమస్కారం సార్ ! సౌఖ్యమా" అందో కంఠం నన్ను పరామర్శిస్తూ. ఆ కంఠానికి వెనకున్న ఓ యిద్దరు పోలీసులు అతన్ని అనుమానించి, ఆ చనువు చూసి, దొంగతనంగాని, మరేదైనా కాని చేశాడేమో అనే అనుమానంతో—స్టేషనుకు లాక్కొచ్చారు.

* * *

స్టేషనుకు చేరేసరికి అసలు పని ప్రారంభం అయింది. వేలిముద్రల నిపుణులు తమ పని పూర్తి చేసుకున్నారు. శవాన్ని కూడా పాతారు. ఆమె అసలు పూర్తిపేరు—ఎల్సా కొయల్హో. వయస్సు నలభైఏడు సంవత్సరాలు—రాచిఫ్‌కు దక్షిణంగా ఉన్న ఒక ఊళ్ళో ఆమె పుట్టింది. "తిరుగుబోతు" కింద ఆమె జైలులో చాలా సార్లు గడిపింది. పది రోజుల క్రితమే ఓ పది రోజులు జైల్లో గడిపి వెళ్లింది.

సీసామీద ముద్రల కోసం నే నంతగా శ్రద్ధ తీసుకోలేదు. ప్రస్ఫుటంగా మొత్తం వేలిముద్రంతా దానిమీదుంది. బహుశా ఆమె—వేలి ముద్రే అయ్యుండచ్చు అనుకున్నాను. సీసా పీక భాగంతో

—36 వ పేజీ చూడండి

నా అనుభవంలోకెల్లా పెద్ద పరిశోధన-6



# సరాగమాల

## వి ఎ కె రంగారావు

ప్రతి చిత్రంలోను ప్రయోగాత్మకంగా శాస్త్రీయసంగీతాన్నే వినిపించిన పెండ్యాల "చిట్టితమ్ముడు" లో కథావసరార్థం జానపద మార్గాన్నే పయనించారు. కాని చిత్ర మేమిటో తెలుసా? ఇది సాధారణంగా శాస్త్రీయసంగీతం మెచ్చే వారికి ఈ రెండవ మాదిరి సంగీతం నచ్చదు. అయినా పెండ్యాల గారి జగదేకవీరుని జయభేరి ప్రయోగించిన వాళ్ళే ఇప్పుడు చిట్టి తమ్ముణ్ణి చేరదీస్తున్నారు. వాటితో "శివశంకరి" "మది శారదాదేవి మందిరమే" విని, తల యూచిన వారే "మాయాబజారు లోకం" విని ఒట్టి తాళం వేస్తున్నారు. ఆ ప్రతిభ పెండ్యాలది. ఫలితం నిర్మాతది. ఫలం మన శ్రోతలది.

జి. ఇ. 35325 రెండు భాగముల పాట. సుశీల పాడిన "మాయాబజారులోకం సావిరంగా" అన్నది. విన్నవారందరూ మరో రెండు భాగాలు ఉంటే, యెంత చక్కగా ఉండు ననుకొనేంత చక్కగా ఉంది. రచనా, సంగీతమూ, పాడటమూ ? మామూలు. రచన ఆరుద్ర. "అవసరాలు తీరగానే, సావిరంగా అయిపులేక పోతారు సావిరంగా" వారు వ్రాసినది వారు యింకేవలనే వెళ్ళిన ఒక ఊరి దొరను గురించి కాదుగదా! ఈ పాట వినాలనే అవసరం ఎప్పటికీ తీరకపోవటానికి కొంత కారణం పేరి రచన. సంగీతం : పెండ్యాల. పేరి వరుసతో, వాద్య రచనతో వెంటనే ఆకర్షించేది సమయస్ఫూర్తి. ఈ పాటకు రాజసులోచన చవుకబారు వీధి నృత్యం చేస్తుంది. (చవుకబారు అనటంలో నా ఉద్దేశం అశ్లీల అని కాదు. సన్నివేశానికి తగిన అనే) దానికి తగ్గట్టుగానే పాటలో మనకు బాగా వినిపించేవి ఒక ఆర్మోనీ పెట్టె, ఒక డప్పు. పైగా ఆడదాని, కాదు, కాదు; ఆటకత్తె కాలి అందెలు. అవి చాలు ఆ పాటకు. గిటారులు అకార్డియనులు, సితారులు, పియానోలు, విన పడవు. ఇక సుశీల పాట: అది పాట కాదు. ఒక అడవిపిట్ట విచ్చలవిడిగా తిరుగుతూ, కొమ్మ కొమ్మనా ఆగుతూ తీగె తీగెనా తూగుతూ వినిపించే మనోహర గానం. ఆ వాద్యగోష్ఠిలో తాళం అంతులేని ఉత్సాహం. ఆ లయ ఓపలేని ఆనందం. ఈ పాట వినండి. మనసుని హుషారు కారెక్కించి షికారు తిప్పండి.

ఇరుగు పొరుగు జి. ఇ. 35334.

ఎల్లారీశ్వరి కంఠానికి ఒక తిన్నటిదనం, ఒక మొన్నటిదనం ఉంది. ఒక పరిమితిలో ఉపయోగిస్తే, తియ్యటిదనమూ ఉంటుంది. ఈమధ్యన వినవచ్చిన ఈశ్వరి పాటల్లో అటువంటిది క్షేమం చేసిన "మబ్బుల చాటున చంద్రునిలా పొద మాటున దాగిన చినవాడా" అన్నది. ఆమె కంఠం సుతారపు సితార తంత్రీ నినాదము కాదు. కండ చక్కెర పలుకు. తేనెల తీగెలు సాగే కోకిలా రవం కాదు. గంట — కంచు కులుకు. రసాల రసధింగవు కాదు. మందార మకరంద చినుకు. ఈమాదిరి కంఠం నచ్చే వాళ్ళకు ఈ పాట ఖుషీగ్గా ఉంటుంది.

ఈ పాట చరణాల వరుస, "సిరిసంపదలు" లోని "వేణుగోపాలుడు" పాట చరణాల వరుస, ఇంచుమించు ఒకేమాదిరిగా ఉంటుంది. రెండింటికీ పెండ్యాలే సంగీత దర్శకులు!? కాని ఈ పాట పల్లవి వరుస ఒయారాల ఊపుతో, సొగసుల బిగువే నడకగా సాగింది. వాద్యగోష్ఠిలో వినపడిన తాళం బాంగోస్ వాద్యంది కాదేమో. పాట వింటుండగా, పరుగులెత్తిన విన్నవారి గుండె సవ్వడియ్యే ఉంటుంది. ఆరుద్ర కలం తాజాగా, మజాగా నడిచింది. "పసివాడనివి, కుసుమించినవి, నా కురులను విరిసిన మాలికలు" ఎన్నో విధాల అలరించే పాట.

రెండవప్రక్క జానకి, శ్రీనివాసుల యుగళ గీతం "సన్నజాజి చెలిమి కోరి చల్లగాలి వీచెను, ఆ చల్లగాలి సోకగానే జాజి మనసు పూచెను." ఈ ఆరుద్ర రచన ఉన్నంత హాయిగా, జానకి శ్రీనివాసుల పాట ఉన్నంత తీయగా వాద్యానుసరణ కూడా ఉంటే ఈ గీతం అమర గీతమే అయ్యేదేమో! యిప్పుడు కూడా యింపుగానే ఉంది వినటానికి. వారి కంఠాల కలయిక అద్దాల మేడలో అందాల దీపము. ఆనందాల దీవిలో అపరంజి రూపము. చిత్రంలోని మంచి పాటలు రెండు ఒక రికార్డుగా రావటం ముదావహం.

ఆశాజీవులు. జి. ఇ. 35323.

ఎంత మంచి పాటలయినా పేలవమైన చిత్రంలో బడితే, చప్పబడి యెందుకూ అందకుండా పోతాయి. "ఆశాజీవుల్లో" అన్ని పాటలు బాగానే ఉన్నాయి. కొన్ని చాలా బాగున్నాయి. అందులో అద్భుతంగా ఉన్నది ఒకటే. జానకి పాడిన నృత్యగీతం "చందురుని చలువలతో, చందనపు తావులతో, కుందనపు మేన మెరే సుర సుందరిని మేనకనోయ్." ఇది పాటకాదు. "సుందర సురభిళ సుమ—హారమ్మది, అందపు కవనపు ఉపహారమ్మది. మంజుల మృదుపద మంజీరమ్మది". స్వర, సాహిత్య, సంగీతాలు అంత చక్కగా అమరినవి. అచ్చరల అందాలు పొదువుకున్న కంఠం: జానకి. మృదు పద జాలంతో ముద్దులాడే రచన : సముద్రాల. లలిత స్వరమాలికలతో స్వయంవరించే సంగీతం : విశ్వనాథన్-రామమూర్తి. ఇటువంటి తేలిక పాటలో స్వరాలు అమరించిన ఘనత దక్షిణదేశపు సంగీత దర్శకులలో సిరికే దక్కుతుంది. మొదట దరువులు చెప్పిన కంఠం సంగీత దర్శకులు, వైణికులు, మాండొలై ప్రియులు అయిన ఎమ్మెస్ రాజుగారిది.

రెండవప్రక్క మాధవపెద్ది, ఎల్లారీశ్వరి పాడిన యుగళగీతం: సరదా పాట. తమాషా తబలా నడకలు దీనిలో ఒక ప్రత్యేకత. వరసంతా పక్కా జానపద ధోరణిలోనే సాగింది. అటువంటి పాటలు పాడటం, యెవరికి స్వంతం? ఆ మాధవపెద్ది హుషారుగా పాడారు. జోరుగా ఈశ్వరి తోడయ్యింది. మొదటి పాటకోసం రికార్డు కొంటే అప్పుడప్పుడు యిదీ వినవచ్చు. అవును; మరచాను. ఆఖరి చరణంలో అశ్లీలత ధ్వనింపజేయటం అవసరమనుకున్నారా, నిర్మాతలు ??





వోల్గా ప్రొడక్షన్స్ వారి ప్రొడక్షన్ నెం 1 చిత్రంలో నటులు చలం, రామారావు

# సరాగమాల సందేహాలు

దేశ రక్షణ నిధికి రిపబ్లిక్ దినోత్సవంనాడు ఢిల్లీలో బొంబాయి—తారలు నిర్వహించిన మ్యూజిక్ ప్రోగ్రాంలో ప్రధాని నెహ్రూ పాటంబడి 'షెహాన్' అనిపించుకున్న ఆ దేశభక్తి—గేయ. వివరాలు తెలుపుతారని ఆశిస్తున్నాను. వీలుంటే ఆ రికార్డు నెంబరు కూడా తెలిపెదరని ఆశిస్తున్నాను.

పెంపుడు కూతురులో ''నాకు కనులులేవు.'' ఈ పాటను సమీక్షించమని అడుగుతున్నాను.

''మాధవరావు'' (కాకినాడ

* * *

వీనస్ పిక్చర్సువారి 'పెళ్ళికానుక' చిత్రంలో. పాటలన్నియు రికార్డులుగా వెలువడినవి. కానీ ఆ సినిమాలోని 'అక్కయ్యకూ సీమంతం' అనే పాటలో, మొదట సినిమాలో పాడబడిన 'మగనాలి వదనాన మాంగల్య కళలీను' అను నాలుగు చరణములు రికార్డులో వెలువడలేదు. మరియు, ఇంటర్‌వల్‌లోనూ, చివరిలోను, జిక్కి, ఏ. ఎం. రాజా లచే పాడబడిన 'తీరెముగా నేటితో నీ తీయని గాధ' అను రెండు పాటలు కూడా రికార్డులుగా రాలేదు. వెత్తపాటలన్నింటిని రికార్డులుగా విడుదల చేసి, చక్కని పాటలైన ఈ రెండింటిని విడుదల చేయకపోవుటకు కారణము తెలుపవలెను.

జి. శ్రీకృష్ణదేవరాయలు (విజయవాడ

* * *

విజయవారి చిత్రాల్లో ఒక కొత్తరకమైన వాద్యం వినబడుతూ వుంటుంది. ఉదాహరణకు ''జగదేక వీరునికథ''లో 'వరించి వచ్చిన మానవ వీరుడు ఏమైనాడని విచారమా' అనే పాట ప్రారంభంలో వినవస్తుంది. ఆ వాద్యం పేరేమిటి? అదెందుకు ''విజయావారి చిత్రాల్లోనే వినవస్తుంది? ఇతరుల చిత్రాల్లో ఏల వినపడదు? అది విజయవారి దగ్గర మాత్రమే వుందా? నా సందేహాలు తీరుస్తారని ఆశిస్తాను. ఇది చాలా మందికి ఉన్న సందేహం కాబట్టి పత్రికా ముఖంగా జవాబిస్తే, అందరికీ సందేహం తీరుతుంది.

కె. హనుమంతరావు (బెంగుళూరు)

* * *

వి. ఎ. కె. రంగారావుగారు జవాబిస్తూ ''అభిమానం'' చిత్రంలోని ''వలపు—తేనె పాట'' తెర మీద చలం, కృష్ణ కుమారి పాడింది అన్నారు. అది తప్పు; సావిత్రి, నాగేశ్వరరావు గుర్రపు బగ్గీలో పోతూ పాడిన పాట అది.

టి. హరనాథ్ (పుంగనూరు)

* * *

శ్రీ వి. ఎ. కె. రంగారావుగారు కేవలము తెలుగు పాటలకే సందేహాలు తీరుస్తారా లేక హిందీ పాటలకు కూడా తీరుస్తారా!

అలాగైతే ''సన్ ఆఫ్ ఇండియా'' హిందీ చిత్రంలో ''ఆజ్ కి సారాకబరు'' అనే పాట పాడింది శాంతి మాతూరు అని తెలిసింది. వీరు పాడినపాటలు ముందు ఏమైనా ఉన్నాయా? దయచేసి సమాధానమిస్తారని తలుస్తాను.

ఎస్. హెచ్. ప్రసాదశర్మ (హైదరాబాదు)★



అన్నపూర్ణావారి ''చదువుకున్న అమ్మాయిలు''లో సూర్యకాంతం, రేలంగి.



అనుపమావారి ''శతృ–తోడూ''లో జమున, జగ్గయ్య.



"ప్రేక్షకుల అభిరుచిని నిందించరాదు" ప్రత్యగాత్మ

—ఫొటో: రావ

# తెర మీద తెర వెనుక

పీ రా జీ

"ప్రేక్షకులు మంచి చిత్రాలను ఆదరిస్తారు — మనకు చాతకాని దాన్ని ప్రేక్షకుల నెత్తినరుద్దడమే గాని ప్రేక్షకుల అభిరుచిని నిందించతగ్గ అవకాశాలు లేవు"— ఈ ఉద్దేశం నాదీ మీదీ అవుతే అవ్వొచ్చును గాని ఇప్పుడు మాత్రం యువదర్శకుడు ప్రత్యగాత్మది. బహుశా మంచి చిత్రాలను తీయుగలిగిన ఘనత దక్కడానికి కూడా శ్రీ ప్రత్యగాత్మకి ఈ నమ్మకమే తోడ్పడి ఉండాలి.

## ప్రయోగాత్మకం ప్రయోజనాత్మకం

వాస్తవానికి శ్రీ ప్రత్యగాత్మలో ప్రయోజనాత్మకం, ప్రయోగాత్మకం—ఐన రెండు రకాల చిత్రాలు తియ్యాలని తీసి చూపించుకోవాలని కూడా ఉన్నట్లు నాకు తోచింది.

'నిరుపేదలు' సినిమా విడుదలైనప్పుడు గాని 'తండ్రులు—కొడుకులు' ప్రదర్శింపబడుతున్నప్పుడు గాని, వాస్తవానికి 'ప్రత్యగాత్మ' అనే పేరు ప్రేక్షకులకు యిప్పుడున్నంత సుపరిచితంగా గాని లేదా సన్నిహితంగా గాని లేకపోవొచ్చును. అయితే దరిమిలాన 'భార్యాభర్తలు' విడుదలయ్యేసరికి ఈయన పేరు అందరికీ వచ్చింది. ముఖ్యంగా 1—6—62 ఆంధ్ర సచిత్ర వారపత్రిక సంచిక చూస్తే, శ్రీ ప్రత్యగాత్మ 'కథ' ను పాఠకులు ఉత్తమంగా ఎన్నుకున్నా రన్నది తెలుస్తుంది. అటు తర్వాత ప్రత్యగాత్మ కులగోత్రాల లో కూడా మంచి ప్రజ్ఞ, అదే స్థాయి ప్రతిభ చూపించారు. అందుకే తెర—వెనుక ప్రేక్షకుల కగుపించకుండా ఉండిపోయిన శ్రీ ప్రత్యగాత్మ పరిచయాన్ని అతనికి గల పట్టుదలను ప్రతిబింబించే వాక్యాలతో నే పరిచయం చేస్తున్నాను.

ప్రత్యగాత్మ సినీ రంగంలో 'జయం మనదే' లో అసిస్టెంట్ డైరెక్టర్‌గా అడుగు పెట్టారు. అటు తర్వాత ఈయన కృషి, పట్టుదలా, నిగ్రహం కూడా "జయం మనదే" గానే రాణించి, యితనికి రచయితగా, దర్శకునిగా ప్రేక్షకుల హృదయా లలో సుస్థిరమైన చోటు నిచ్చాయి.

## మంచి చిత్రం అంటే?

ఈ ప్రశ్నకు శ్రీ ప్రత్యగాత్మ "కళాభిరుచి ఉన్నతమైన ప్రయోజనం—రెండూ కలుగజేసేది' అని క్లుప్తంగా జవాబిచ్చారు.

ఐతే ఇంత టూకీగా అంటే ఐపోతుందా? 'టూకీ' గా ఓ మంచి కథ రూపొందాలి అంటే అందుక్కావల్సిన మంచి మార్గాలూ, మదింపులూ చాలా ఉన్నాయి. అదే నేను కదిపాను. శ్రీ ప్రత్యగాత్మ "సినిమా ప్రపంచంలో ఆనవాయితీగ వస్తున్న కొన్ని సంప్రదాయాలు, కొత్తదనానికి ఆటంకా లవుతున్నా యన్నమాటను కాదనలేదు.

కొత్తదనం, దాని కో ప్రయోజనం; కథకుడు, దర్శకుడు యిస్తాడనే అనుకుందాము. ఐతే అసలు పెట్టుబడిదారు, దాని లాభ—నష్టాలను నేరుగా భరించేవాడూ ఐన నిర్మాత(ల) యిష్టా నిష్టాల మాటేమిటి? అతనికి కొన్ని సెంటిమెంట్సు కొన్ని నమ్మకాలూ ఉంటాయి. అంచాత రచయిత, దర్శకుడూ కూడా నిర్మాత దృక్పథాన్ని అది కళాత్మకమే అవనీండి, వ్యాపారాత్మకమే గానీండి అనుసరించాలి."

## రెండు శక్తులు

"అంటే నిర్మాతలు, ప్రజలు అనే రెండు శక్తుల మధ్య, వాటి అభిరుచుల మధ్య ఒక పొంతన కుదర్చవలసిన బాధ్యత రచయిత, దర్శకుడు ఐన వాళ్లమీద ఉన్నదన్న మాటే కదా?" అన్నాను నేను.

"మరే .... కథావస్తువును తీసుకుని దానిని సినిమాకరణం చేస్తూన్నంతసేపు యిటు నిర్మాత యొక్క, అటు ప్రజలయొక్క అభిరుచులను తృప్తిపరుస్తూ—మధ్యలో "నేనూ, నా సందేశమూ" ఉన్నాము. సుమా అని రచయిత, దర్శకుడూ చిత్రంలో అగుపించాలి" అని శ్రీ ప్రత్యగాత్మ జవాబు.

ఇది మాటలు చెప్పినంత సులువు కాదు గాని శ్రీ ప్రత్యగాత్మ 'భార్యా భర్తలు' లో సాధించిన తీరునుబట్టి ఈ మాటలను అనగల అవకాశం ఆయన కున్నది. నిజమే. రచయిత, దర్శకుల కిరుపురికి ఉన్న బరువు—బాధ్యత లల్లాంటివే.

అంతేకాదు; 'రచయితకూ, దర్శకునికీ సన్నిహిత సంబంధం, పొంతన చాలా అవసరం' అని ఆయన ఉద్దేశం. "అవి చిత్ర విజయానికి దోహదకారు లవుతవి."

## భార్యాభర్తల కథ గురించి

వాస్తవానికి 'భార్యాభర్తలు' కథకు ఆధారం తమిళంలో 'లక్ష్మి' వ్రాసిన స్త్రీ హృదయం (పెన్ మనస్) అనే నవల (1952). ఈ కథలో ఇంత సినిమాటిక్ డ్రామా ఉందన్నది ఎన్నాళ్లో ఎవరూ గుర్తించలేరు—దాన్ని సాహసంచేసి తీసినప్పుడు కూడా కొందరు "ఏంటీ సెంటిమెంట్" అన్నారు. ఒక్కోసారి అభిరుచిమీద, అభిప్రాయం మీద ఆధారపడి కొన్ని అజ్ఞాతమైన కథావస్తువులు అలాగే ఉండిపోటమో లేదా వెలికి రావడమో జరుగుతుంది. ఈ చర్చ సందర్భంలోనే శ్రీ ప్రత్యగాత్మ భార్యాభర్త' ల కథను ఆదరించిన తెనుగు ప్రేక్షకుల పట్ల గౌరవాన్ని ప్రకటించారు.

## మంచి ఆశయాలు

శ్రీ ప్రత్యగాత్మ మంచి ఉత్సాహం, ఒక క్రమబద్ధమైన ఆలోచన గల దర్శకుడు. ఆయనలో సాధించాలి అనే ఆవేశం ఒక్కటే గాక, కొత్తదనం, మంచిదనం చిత్రీకరణలో చూపించాలి అనే ఉబలాటం ఉన్నది. ప్రతిదానికి ప్రేక్షకులను సాధించడం, వారు "చౌకబారు" గా ఉండకపోతే చూడరు అనడం లాంటి ధోరణి ఈ దర్శకునిలో అగుపించలేదు.

ప్రేక్షకులకు 'మెలో డ్రామా' ఉంటేనే గాని రుచించదనీ, కాస్త చౌకబారుగా ఉండాలనీ లాంటి వ్యాఖ్యలను మీరు ఒప్పుకుంటారా? అన్నాను.

ఆయ నిలా అన్నాడు పూర్తి విశ్వాసంతో: "ఒప్పుకోను; పైగా అది మనకు చాతగానిదాన్ని ప్రేక్షకుల నెత్తిన రుద్దడమే అని కూడా అంటాను. "పడికట్లు" "హిట్సూత్రాలు" అవి అన్నీ కేవలం అపోహలు. ప్రేక్షకుల నాడిపోనుకోకుండా, మనం నిర్మాణరంగాన, రచనా రంగాన, పాంకేతిక రంగాన గల లోటుపాట్లను సర్దుబాటు చేసుకోవాలి; సరిదిద్దుకోవాలి."

ఈ జవాబు చెప్పగల దర్శకునిపై మనకు భరవసా ఉండటం — ఇతని భవిష్యత్తు ఉజ్జ్వలం కావాలని మనం కోరడం రెండూ సహజమే నను కుంటాను. 'సినిమాలోకం శీర్షిక క్రింద తెనుగు సినీ కథల తీరు మీద సచిత్ర వారపత్రికలో వరుసగా 'పి. కృష్ణానంద్' రాసిన వ్యాసాలను సైతం యీయన పేర్కొని — "అక్కడ పేర్కొన్న రకరకాలైన యిబ్బందులు — "ఒరిజనల్ కథలను ముందుకు రానీడం లేదన్నది అసత్యం కాదని" అన్నారు శ్రీ ప్రత్యగాత్మ.

నే నీ యింటర్వ్యూకి వెళ్లినప్పుడు హిందీ—నవల ఆధారంగా, కొత్తచిత్రం (పి. ఏ. పీ.) కథచేసే ప్రయత్నంలో ఉన్నారు—నవల పేరు 'పత్థర్ కే




మీ చర్మము ఎంతో అందముగా కనబడును... ఎంతో అందముగా వుండును...ఎందవలననగా లాక్టో-కేలమైను మీ మొఖము మీది మొటిమలను మరుగు పరుస్తూ బాగుచేయుటకు వైజ్ఞానికముగా సమకూర్చబడిన సౌందర్య సాధనము! ● దీని మీద పౌడరు బాగా అద్దుకొనును.లాక్టో-కేలమైను త్వరగా పనిచేయు మంచి రకమైన కేలమైను గలిగియున్నది—మచ్చలను పోగొట్టును...ఎండ వేడిమి మరియు వేడిగాలినుండి మీ మొఖమును కాపాడును...మీ సౌందర్యమును ప్రకాశవంతముగా ఆకర్షణీయముగా నుంచును! ● దీనిని కాస్మెటిక్ వైద్యులు మీ చర్మమునకు కూడ సిఫారసు చేయుచున్నారు!

లాక్టో-కేలమైనుగల ఇంకను కొన్నివస్తువులు: క్రీమ్ మరియు టాల్కమ్ పౌడరు.

# లాక్టో-కేలమైను

# మీ సౌందర్య సాధనము



హాంగ్' అనీ, అది రాసిన రచయిత ప్రఖ్యాత గుల్షన్ నందా అని చెప్పినట్లు జ్ఞాపకం.

వాస్తవానికి శ్రీ ప్రత్యగాత్మకు "ఒక ఒరిజినల్ కథను, కొత్త ఫక్కీలో తియ్యాలనీ" సదాశయం ఉన్నది. ఇది త్వరలోనే నెరవేరాలని నా ఉద్దేశం కూడా.

పోతే, ఈ సందర్భంలోనే సినిమా తీస్తున్నప్పుడు కొన్ని పాత్రల చిత్రీకరణ నీ దర్శకుడు ఏ విధంగా చేస్తాడూ అనే కుతూహలం మనలో చాలామందికి ఉండవచ్చు. అందుకే ఈ ప్రశ్న: "మన స్ఫూర్తిగా ఒక ధ్యేయంలో ప్రవేశపెట్టిన రెండు 'పాత్ర' లను, వాటి రూప కల్పనను పేర్కొన మన్నా"ను.

## కొన్ని పాత్రల రూప కల్పన

శ్రీ ప్రత్యగాత్మ భార్యాభర్తలలో 'శారద', 'ఆనంద్' పాత్రలను ఉదహరించారు. అందులోని ధ్యేయం:—! భార్యాభర్తల సంబంధంలో భార్య పతి

## తెరమీద-తెర వెనుక

వ్రతగా ఉండాలీ అనే అవసరం గురించి కథలు చాలా ఉన్నాయి గాని, అలాంటి మహాసాధ్వి ఐన భార్యకు భర్త ఎలా ఉండాలి? అనేది లేదు. అదే చూపిస్తుందీ పాత్ర రూపకల్పన.

'భార్యాభర్తల శరీరాల కలయికతో వివాహ బంధం పూర్తికాదు. అది హృదయాల కలయికతో ప్రారంభ మవుతుంది' అనే మన నమ్మకాన్ని, మంచి నిజాన్ని ప్రత్యగాత్మ యిక్కడ చెప్పాలనుకున్నారు. అలాగే కులగోత్రాలులో రెండు పాత్రలను తీసుకొనండి. ఒకటి (హీరోయిన్) కథానాయిక తల్లి, రెండు: కథానాయకుని (హీరో) తండ్రి—

అమ్మాయి తల్లి సమాజ పురోగతిని కాంక్షించి ఎదురీదే నైజం గలది. అబ్బాయి తండ్రి సంప్రదాయాల పేరిట ముందడుగుకు అడ్డు తీగెలు వేస్తాడు. అహంకారంతో మంచి మార్గాలన్న కాదంటాడు. ఈ సంఘర్షణను చూపాలన్న ధ్యేయమే కులగోత్రాలలో మనం చూస్తాము.

ఈ రెండు ప్రయత్నాలు ఈయనకు మంచి ప్రశంసలను కురిపించాయి.

మన సినిమా దశ ప్రస్తుతం ఎలా ఉన్నదన్న నా ప్రశ్నకు శ్రీ ప్రత్యగాత్మ కొంచెం కొంచెం మారుతున్న దశలో ఉన్నదని జవాబిచ్చారు.

"ప్రయత్నంలో కాస్త చిత్తశుద్ధి; చిత్రీకరణలో ఉత్తమ కృషి — యిటీవల వస్తున్న మంచి లక్షణాలు."—

## కోరికలు

శ్రీ ప్రత్యగాత్మకు కులగోత్రాలను హిందీలోను అరవంలోను తీయాలని కోరిక ఉన్నది. మంచి కోరికయే యిది.

శ్రీ ప్రత్యగాత్మకు గల ఇతర కోర్కెలూ మంచివి.

ఇతని ప్రయత్నాలు కూడా యింతవరకూ వచ్చిన చిత్రాలు చూస్తే గట్టివే ననడంలో సందేహమక్కరలేదు. అంచేత ఒక ఖచ్చితమైన ధ్యేయంతో, ప్రేక్షకుల ఉత్తమాభిరుచిమీద విశ్వాసంతో, ఈ దర్శకుడు మరిన్ని మంచి చిత్రాలను ఒరిజినల్వి తీయాలని ఆశిస్తున్నాను.

ప్రస్తుతం ఈయన పి. ఏ. పి. వారి కొత్త చిత్రానికి కథను తయారు చేస్తున్నారు. శుభమ్.

## చదువలాష - బి. వి. సత్యమూర్తి



## సౌరాసీసౌ

37—పేజీ తరువాయి

ఆ చేతిముద్ర తల్లక్రిందులుగా ఉంది. (బొటన వేలు గుర్తు కింద వైపుకు వచ్చేలాగ) అంత ప్రస్ఫుటంగా పడ్డ ఆ చేతిముద్రని చూసేసరికి పకలు తీసి ఓ హస్తసాముద్రికుడికి చూపించి, అమె—చావు చేతి రేఖల్లో ఉందేమో చూడమందా మనిపించింది. కాని, అలాటి కోర్కెలకు అది సమయం కాదని ఊరుకున్నాను.

"ఎల్సా—ముష్టిఎత్తుకుని జీవనం చేసేది గనుక అవైపువాళ్లనుంచే పరిశోధన సాగితే మంచిది" అనుకున్నాను.

నగర సంబంధమైన ముష్టివాళ్లు సామాన్యంగా తప్పుడు దోవల పడతారు అలాగని హత్యలు చేయరు వాళ్ల 'సోదర ముష్టిబృందం' లో ఒకరు హత్య చేయబడడం అనేది సామాన్యంగా వాళ్లు కోరరు లోకమంతా ఒకే ముష్టివాని సొత్తు కాదుగా!

ఎల్సా నీడన బతికే చిల్లర ముష్టివాళ్లు నా పరిశోధనకు కొంత సహాయం చేశారు ఎల్సాని హత్య చేసిన 'వ్యక్తి'ని పట్టుకోవాలని నాకున్న ఉత్సాహంకన్నా—వాళ్లు ఎక్కువ ఆతృత కనబరిచారు.

పాడి—పంటా ఉన్న ఓ కామందు—యింట్లో ఎల్సా—వయస్సులో ఉండే రోజుల్లో పని మనిషిగా ఉండేదని, ఆ కామందు కొడుకు అమెను పొందాలని చేసిన ప్రయత్నాల్లో—పతితురాలై 'ఈవిధంగా' జీవితాన్ని గడుపుతోందని చెప్పారు.

కనుక అమె అంటే ప్రతి వాడికీ యిష్టమే! కానీ అమెకు యిష్టమైనవాడు—ఎర్నెస్టో అనే మరో ముష్టివాడున్నట్టు చెప్పారు—కానీ, యిటీవల వాళ్లిద్దరూ ఎందుకో పోట్లాడుకుని, విడిపోయారని కూడా చెప్పారు.

"భలే—భలే—ముచ్చట—'ముష్టి ప్రేమ'—దెబ్బలాట, త్రాగుడు, తలమీద దెబ్బ, ఎల్సా మరణం—ఈవిధంగా జరిగిఉంటుందా!" అనుకున్నాను నా మనస్సులో ఆలోచనలకు రూపకల్పన చేసుకుంటూ.

"ఎర్నెస్టో ఏడి? ఎక్కడ?" అన్నాను అతన్ని చూడాలన్న కోరికతో.

అత నిటీవల ఆ ప్రాంతాలకు వచ్చినట్టు లేడని, ఒకటి రెండు రోజుల్నుంచీ ఎవరూ అతన్ని చూడలేదని, సిసిలాండియా ప్రదేశంలో రియోన్ బ్రాడ్వేలో, సినిమా హాళ్ల దగ్గరా, జనసమ్మర్దమైన చోట్లా తన "డ్యూటీ" సాగిస్తూనే ఉంటాడని చెప్పారు.

వాళ్లల్లో ఒకడు నాతో స్టేషనుకొచ్చి దొంగల నేరస్తుల—ఆల్బమ్‌లో ఎర్నెస్టోని గుర్తు పట్టాడు. అతన్ని వెతికి పట్టుకోడానికి ప్రయత్నాలు ప్రారంభించాను. డిటెక్టివ్‌లు రోజుల తరబడి చూసి చూసి, ఆలోచించి చేసే పని—మా పోలీసులు నిముషంమీద చేశారు.

మూడ్రోజుల్లో ఎర్నెస్టోని లాక్కొచ్చారు. అతను పొట్టిగా సన్నగా ఉన్నాడు. బాగా పెరిగిన గడ్డం, ఎర్రగా, సోమరిగా ఉన్న అతని కళ్లూ, అంతటగా ఉన్న శరీరంతో భయంకరంగా ఉన్న 'అతనికీ', చక్కగా క్రాపుతో—గడ్డం లేకుండా (క్రొత్త పెళ్లికొడుకులా) ఉన్న ఫోటోలో వ్యక్తికీ ఎక్కడా

సంబంధం లేదు. పిచ్చి కోసం, అతను ఎర్నెస్ట్ కదూ!

రెపరెపలాడే కళ్లతో—చక్కని పాలిష్ చేసి, తున్నగా ఉన్న నా టేబులు మీంచి—పెల్లుబాడిన పోలీసు—స్టేషను గోడలమీదికి తన చూపులు మరల్చుకున్నాడు.

'ఆమె నెప్పుడైనా చూశావా' అంటూ నేను ఎల్సా ఫొటో టేబులుమీద పెట్టి అతనివైపు నెట్టాను. అతను దానివంక ఓ క్షణం చూశాడు.

"చూశాను—మేమిద్దరం ఒకానొక రోజుల్లో స్నేహితులం" అన్నాడు నవ్వడానికి ప్రయత్నిస్తూ.

"నీకు ఎల్సా చంపబడ్డట్టు తెలుసా" అని తట్టున అడుగుతూ—అతని ముఖంకేసి పరీక్షగా చూశాను.

అతని కళ్లు ఆశ్చర్యంతో బయటికి వచ్చాయి.

"ఆమె చంపబడ్డ ముందురోజు—ఆమెకూ, నీకూ పోట్లాట వచ్చిందిట. అవునా ?"

అతను సమాధానం చెప్పలేనంత ఆశ్చర్యం నటించాడు.

"ఎందుకు పోట్లాడావు ?"

"నేనా—దేవునిమీదొట్టు—నే నామెను చంపలేదు." అని అరుస్తూ అతను గట్టిగా దగ్గ నారంభించాడు. అతన్ని దగ్గుకోనిచ్చాను. అతనికి క్షయ ఉన్నట్లు తెలిసింది. కాస్సేపటికి తమాయించుకున్నాడు.

"సరే! నీకూ, ఎల్సాకూ ఎన్నాళ్లనుంచి సంబంధం ఉంది ? అసలెలా ప్రారంభమయింది ? ఎందుకు తెగింది ? ఎలా తెగింది ?— ఈ వివరాలన్నీ వివరంగా చెప్పు." అన్నాను.

ఆమె తనకు ఐదేళ్లనుంచి తెలిసిఉన్నట్టూ, రెండేళ్ల క్రితం నుంచీ ఆమె తనతో కలిసి ఉంటున్నట్టూ, ఆనక తనకి ఆమెమీద అనుమానాలు ఏర్పడ్డట్టూ చెప్పాడు. మూడు వారాల క్రితం—'బిచ్చగాళ్ల చట్టం' తో యిరుక్కుని జైల్లో కొంతకాలం గడిపి—తిరిగి ఎల్సా నివాసానికి వెళ్లేసరికి ఆమె కనబడలేదని, కొన్ని రోజుల క్రితం అనుకోకుండా ఆమెను కలుసుకుని తను అనవలసిన మాటలన్నీ అన్నానని, ఆమె అందుకు ఒప్పుకోలేదని, అందువల్లే పోట్లాట వచ్చిందని—తనకి హత్యతో సంబంధం లేదని చెప్పాడు. ఎల్సా కనబడని రోజుల్లో—ఆమె వేరొకడితో ఉంటున్నట్టు తను అనుమానపడ్డట్టూ, అదేమాట ఆమెతో అన్నట్టూ చెప్పాడు.

"హత్య జరిగిన నాటి రాత్రి—అంటే పోను వారం రాత్రి నువ్వెక్కడున్నావ్" అన్నాను.

"డాక్ (ఓడల రేవు) ప్రాంతంలో ఉన్నాను" అన్నాడతను పెదవులు చప్పరిస్తూ.

"నువ్వా ప్రాంతాల్లో రాత్రంతా ఉన్నట్టు సాక్ష్యం ఉందా."

"న్నా—లేదు".

"అయితే ఆ రాత్రి ఎల్సా—యింటికి నీవు నిజంగానే వెళ్లలేదా ?"

"లేదు. దేవుడుమీదొట్టు—నే నే పాపం ఎరగను"

నేను బుర్ర గోక్కుని—"సరే—యితన్ని తీసుకెళ్లి దాచండి" అన్నాను. నా బుర్ర ఆలోచనల్లో ఉంది. ఎర్నెస్ట్ గనుక ఆ రాత్రి నిజంగా డాక్ ప్రాంతంలో నిద్రకునితుంటే, మరో బిచ్చగాడు చూసి ఉండి తీరాలి. సామాన్యంగా ఏ బిచ్చగాడూ ఒంటరిగా ఉండడు. కానీ, ఆధారాలు లేకుండా నేరం నిర్ధారించుకోలేదు.

మళ్లీ—మళ్లీ అతన్ని ప్రశ్నించి చూశాను. ఆధారాల్లేకుండా నేను ప్రశ్నిస్తున్నట్టు తను గ్రహించి,నా ప్రశ్నలకి డొంకతిరుగుడు, తలతిక్క సమాధానా లివ్వడం ప్రారంభించాడు.

ఆనాడు మరోసారి అతనితో మాట్లాడాను. ఫలితం మామూలే అయింది. నాకు తిక్క కోపం వచ్చి తల తిరిగింది. కోటు భుజాన వేసుకుని కాళ్లీడ్చుకుంటూ యింటికి చేరాను.

ఇంటి గడప తొక్కేసరికి నా నిరుత్సాహం ఎగిరిపోయింది. ఘుమఘుమలాడే పిండివంటల సువాసన్ను ముక్కునిండా పీలుస్తూ, పిండి కలుపుతున్న చేతులతో వచ్చి—మా ఆవిడ— "ఒక్క నిముషం—ఐపోయింది—" అంది.



ఒక పాత పార్లమెంటు సభ్యుడు, కొత్త పార్లమెంటు సభ్యుడితో చెప్పాడుట: "ఈ పదవికి తగనని బాధపడకండి. మొదటి మూడు నెలలూ ఇక్కడికి వచ్చి ఎలా పడ్డామా అనుకుంటారు. తర్వాత మిగతా వారంతా ఎలా సభ్యులయ్యారా అనుకుంటారు!"

కె. వి. ఎస్. (చీరాల)



"నా కేం పెద్ద ఆకలిగా లేదు" అన్నాను. నిరుత్సాహాన్ని ప్రదర్శిస్తూ.

"అహహ్హా—ఫలహారం చేతికి వచ్చేవరకూ మీ కాకలి లేకపోవడం మామూలేగా" అంది మా ఆవిడ పకపక నవ్వుతూ.

వంటింట్లో—ఓ కుర్చీ లాక్కుని కూర్చుని ఆమెవైపు చూడసాగాను.

ఆమె ఒక సీసాలోంచి గ్లాసులోకి వైన్ పోస్తోంది. పోసి, సీసా టేబులుమీద పెట్టి, తన పనిలో నిమగ్నమయిపోయింది. నా దృష్టి సీసామీద నిలిచింది. ఆ సీసా మీదమీద పిండితో కలిసిన ఆమె వేలిముద్రలు—చేతి ముద్ర స్పష్టంగా పడ్డాయి.

నా కళ్లు ఆశ్చర్యంతో పెద్దవయ్యాయి.

ఉలిక్కిపడి, ఎగిరి కుర్చీలోంచి లేచి, కోటు భుజాన వేసుకుని "ఇప్పుడే వస్తా" అంటూ స్టేషనుకు పరుగెట్టాను.

డిటెక్టివ్ (పోలీసు) భార్యగా తరిఫీదున్న ఆమె—"నిజం డాళీ. మిమ్మల్ని—నోయ్" అని అరుస్తూ ఆ కూడా పడలేదు.

గమ్మున ఆఫీసుకు వచ్చి—"నీమీద హత్యానేరం మోపుతున్నా—నువ్వే హంతకుడివి" అని అరుస్తూ ఎర్నెస్ట్‌మీద విరుచుకు పడ్డాను. ఆనక ఆనాడు కాగితంలో చుట్టి, దాచిన సీసాను సొరుగులోంచి తీశాను.

సీసాను చూడగానే ఎర్నెస్ట్ గంతేశాడు. "నే చెయ్యలేదు—చెయ్యలేదు" అని వెర్రిగా అరిచాడు.

"పొరపాటు—నే చెయ్యలేదు—పొరపాటు" అన్నాడు మళ్లీ పుంజుకుని.

"ఔను. ఈ సీసా అక్కడుంచడం పొరపాటే! నువ్వేకాదు—సీసా మూతిమీద వేలిముద్రలు—చేతి ముద్ర ఎల్సావే అయ్యుంటుంటాయని నేమా పొరపడ్డాను. కానీ, యిప్పుడు తెలిసింది. సీసామీద చేతిముద్ర తల్లక్రిందులుగా ఉంది. అంటే, బొటనవేలు—ముద్ర కిందివైపు వచ్చింది. సీసాలోంచి సారా పోసుకోడానికి పట్టుకుంటే—చేతిముద్ర తల్లక్రిందులుగా రాదు. బొటనవేలి ముద్ర పైకే ఉంటుంది. కాని సీసాని గద పట్టుకున్నట్టు పట్టుకోడంవల్ల ముద్ర తల్లక్రిందులుగా పడింది. ఇదిగో యిలా సీసాని పట్టుకున్నావు" అంటూ సీసాని గదలా పట్టుకుని చూపించాను.

ఎర్నెస్ట్ కాస్సేపు రెపరెపలాడాడు. చిన్నగా దగ్గుతూ—"ఔను. ఎల్సా నాతో పోట్లాడుతున్నప్పుడు నేను తాగుతున్నాను. కోపం వచ్చి సీసాతో ఆమె తలమీద కొట్టాను." అన్నాడు.

ఇక సీసామీద వేలిముద్రలు—ఎర్నెస్ట్ వేలిముద్రలతో పోల్చడం అనవసరం. అయినా పోల్చి చూసి రూఢి చేసుకున్నాము.



* * *

జడ్జి అతనికి యావజ్జీవ శిక్ష వేశాడు. ఎల్సా నిజంగా అతన్ని మోసగించలేదని, ఆమెను అతనే అపార్థం చేసుకున్నాడని తేలింది.

అసలు—ఎర్నెస్ట్ బిచ్చగాళ్ల చట్టంలో యిరుక్కుని, జైలుకి వెళ్లి—తిరిగి వచ్చేసరికి—ఎల్సాని 'తిరుగుబోతు' నేరం క్రింద జైల్లో పెట్టారు. అతను ఆమె ఇంటికి వెళ్లేసరికి ఆమె కనబడలేదు. అది అనుమాన ఆధారంగా తీసుకుని పొరపాటుపడి, ఆమె మరొకడితో పోయిఉంటుందని—జైలునుంచామె వచ్చాక—హత్య చేశాడు. ఇదీ సంగతి.

నేను రియోడిజనైరో—(సిబ్బందికి) పోలీసు చీఫ్ నయ్యాను. ఇది జరిగి నాలుగు సంవత్సరాలైనా—ఆనాటి సంఘటన మరుపులేదు— నేను పూర్తిచేసుకుని యింటికి వచ్చేసరికి చల్లారిపోయిన ఫలహారాల ముందు నీళ్లు కారుతూ నా భార్య కూచుని, నాకోసం ఎదురు చూస్తోంది. ఆనాటి ఫలహారం ఉన్నంత రుచి—మరేనాడూ లేదు. జరిగినదంతా ఆమెతో చెప్పేసరికి—"మరి బావుంది. వెళ్లి ఆ దిక్కుమాలిన ఆఫీసులో కూర్చునేకన్నా—వంటింటి పొయ్యిదగ్గర కూర్చుంటేనే—మీ బుర్ర మరీ చురుగ్గా పనిచేస్తుందన్నమాట" అంది కిలకిల నవ్వుతూ. ★

# శ్రీదేవి

23 వ పేజీ తరువాయి

స్త్రీలు భగవంతుడి కెరుక. నా పుట్టింటివారు, నా భర్త—దాయాదులూ, రాజయ్యగారూ—వీరంతా నన్ను పెట్టిన తిప్పలు ఇన్నీ అన్నీ కాదు. నేను చిన్నదాన్ని కాబట్టి తమ మాట విని, ఆస్తంతా తమకు అప్పజెప్తానని మా అన్నదమ్ములు అను కొన్నారు. వాళ్ళు నన్ను తమ యింటికి ఆహ్వానించారు. నేను అత్తవారింట్లోనే ఉండదల్చుకున్నాను. దాయాదులు, మా ఆయన రాసిన వీలు చెల్లకుండా చెయ్యాలని ప్రయత్నించారు. రాజయ్యగారు, నా ఆస్తిని — ముఖ్యంగా పొలాన్నీ రైతుల్నీ తనచేతుల్లో బిగించుకు కూర్చున్నారు. బోలెడు ఆస్తి; ఒంటరి ఆడది! వీరందరూకూడా, ఆస్తితోసహా నేను తమ చేతుల్లో చిక్కుతానేమోనని చూశారు. ముఖ్యంగా రాజయ్యగారు ఆస్తిని కాజేద్దామని, నన్ను భ్రష్టురాలిని చేద్దామని చూశారు. నా స్నేహితురాలొకావె, ఆమెభర్త లాయరవడం వల్ల, కోర్టు వ్యవహారాలన్నీ జరిపించడంలో సాయపడింది. నా పుట్టింటివారు, నేను తమ మాట వినలేదని నాకు శత్రువులైపోయారు. దాయాదులు వ్యవహారరీత్యా న్ను సాధించలేక, నన్ను బెదిరించి లొంగదీద్దామనుకున్నారు. రాజయ్యగారు, అయిదేళ్ల పంటలో ఒక్కగింజ నా కంట బడకుండా చేశారు. ఉండడానికి పెద్ద ఇల్లు ఉంది. కానీ రోజులు గడవడానికిబ్బందైంది. బంగారమంతా అమ్మేశాను. అయినా కొన్నిరోజులు చాలా ఇబ్బందితో గడిపాను. ఒకవైపు వ్యవహారం నడిపి ఆస్తిని నా స్వాధీనం చేసుకోవాలి. మరొకవైపు భర్తపోయారని దుఃఖం. ఇంకొకవైపు నా వాళ్లంతా నామీద కక్ష గట్టారనే భయం. వీటన్నిటితోనూ నాలో నేను కుమిలి పోతూండేదాన్ని. ఆస్తి చివరకు నా స్వాధీనమైంది; ఎలాగా అవుతుందని తెలుసు వాళ్లందరికీ అయినా, నేను లొంగుతానేమో అని నన్ను అనవసరంగా బాధపెట్టారు. అదంతా, నేను స్త్రీనవడం వల్లనేను. నన్ను ఎన్నో పరీక్షలు చేశారు. అయినా నన్నేమీ చెయ్యలేకపోయారు. ఆడది ఏ పని చేసినా ప్రతివారూ విమర్శిస్తారు. వెయ్యికళ్ళతో వెదకి ఆమెలో లోపాల్ని ఎంచుతారు. ఒకవేళ వారికేమీ లోపం కన్పించకపోతే, ఆమె ప్రవర్తన చాలా గూఢమైనది, అంటారే గాని, తమ కామెలో ఏమీ లోపం కన్పించలేదు గాబట్టి మంచిదని ఒప్పుకోరు" అంది సుందరమ్మ.

"అయితే చాలా చికాకులు పడ్డారన్నమాట మీ జీవితంలో. అందుకే, ఇతరుల కష్టాల్ని మీరు గ్రహించగలరు" అంది శ్రీదేవి.

"అంతేకాదు; ఇతరుల మనోభావాలు కూడా పరిశీలిస్తూ ఉంటాను. ఏ విషయంలోనైనా స్త్రీ దిపైచెయ్యి కావటం మగవాడి కిష్టం ఉండదు. అది ప్రతి మగవాడిలోనూ నేను కనిపెడ్తూ ఉంటాను" అంది సుందరమ్మ.

"దానికి కారణం, అన్ని రంగాలలోను పురుషులే ముందంజవేసియున్నారు కాబట్టి, తమ ఆధిక్యతను పోగొట్టుకోవడం వారి కిష్టంలేక పోవడమేమో" అంది శారద.

"ఎందు కిష్టంఉండదు! స్త్రీలుకూడా బాగా చదువుకొని పైకి వచ్చి తమ సామర్థ్యం చూపిం

లేకపోబట్టి గాని, లేకపోతే స్త్రీలూ అన్నిరంగాల లోనూ పురుషులతో సమానంగానే ఉండేవారు. అది జరిగితే పురుషుల ఇష్టాయిష్టాలతో నిమిత్తం ఉండదు. పురుషులకు మనమిచ్చిన స్థానమే ఇది'' అంది శ్రీదేవి.

''సృష్టిలో ఏ వస్తువుకైనా, ఏ పనికైనా, పరిపూర్ణత సిద్ధించాలంటే, పురుషుని శక్తితోబాటు స్త్రీయొక్క కృషికూడా మిళితంకావాలి. పరస్పర భిన్న ప్రవృత్తులతో స్త్రీ, పురుషుల్ని భగవంతుడు సృష్టించాడు. సృష్టిలో ప్రతి వస్తువులోనూ కొంత పురుషత్వం, కొంత స్త్రీత్వం, నిండిఉంది. కేవలం పురుషాకారంగా గాని, కేవలం స్త్రీ తత్వ నిర్మితంగా గాని ఏదీలేదు. బలం, కాఠిన్యం, పురుషుల సొత్తైతే, సౌందర్యం, సౌకుమార్యం స్త్రీసొత్తు. ప్రతి పనిలోనూ, ప్రతి వస్తువులోనూ బలంతో పాటు సౌందర్యం, సౌకుమార్యం వుంటేనే, అది మనల్నాకర్షిస్తుంది. వట్టి బలమే ఉంటే, అది పెళుసై విరిగిపోతుంది. వట్టి మెరుగేవున్నా, దాని ఉపయోగం ఉండదు. బంగారంలో బరువూ, ప్రకాశం—రెండూ ఉండబట్టే అది అంత విలువైనదీ ఉపయుక్తమైనదీ అయింది'' అంది సుందరమ్మ. శ్రీదేవి, శారదా ఆమె మాటల గురించి ఆలోచించారు.

''మీరు చెప్పినదాన్నిబట్టి చూస్తే, అన్ని రంగాల లోనూ పురుషులతోబాటు స్త్రీలు కూడా సమానంగా పాల్గొంటే, సమాజంలో పరిస్థితులు ఇప్పటికంటే బాగుంటాయంటారు. ఎందువల్ల నంటే పురుషశక్తీ, స్త్రీ శక్తి మిళితమైన, ఇంత కన్నా గొప్ప భావాల్ని, పరిపూర్ణ భావాల్ని సృష్టించొచ్చుగాబట్టి'' అంది శారద. ''తప్పకుండా అది నిజం!'' అంది సుందరమ్మ.

శ్రీదేవి నవ్వుతూ, ''అయితే రాజకీయాలలో కూడా స్త్రీలు, పురుషులతో సమాన పదవులలంకరిస్తే, ప్రపంచపు వాతావరణమే మారిపోతుందంటారు. బహుశా విశ్వశాంతికి, ఇప్పటి అగ్రనాయకులు ఊహించలేని పరిష్కారమార్గ మేదో వారికి స్ఫురిస్తుందేమో!'' అంది. అందరూ నవ్వారు.

''అందులో అసంబద్ధమేమీ లేదు'' అంది సుందరమ్మ.

శ్రీదేవి ఉన్నతవిద్య నభ్యసించడానికి శారదా, సుందరమ్మా ఎన్నో విధాలుగా ప్రోత్సహిస్తుండే వారు. మీనాక్షమ్మకూడా తరచు శారద—యింటికి వచ్చి, వీరందరితో మాట్లాడేది; ఆమెకూడా శ్రీదేవిని సదభిప్రాయంతో గౌరవిస్తుండేది. మీనాక్షమ్మవి సంకుచిత భావాలు. ఏ విషయమైనా విశాల దృక్పథంతో ఆలోచించదు. స్త్రీలు పురోభివృద్ధి చెందాలి అనే భావం, ఆమె వ్యక్తిగతంగా తనూ, తనకూతురూ అభివృద్ధిలోకి రావాలనే ఉద్దేశంతో, ప్రకటిస్తుంది కాని స్త్రీలందరూ పైకి రావాలని అభిప్రాయంకాదు. శారదా, సుందరమ్మలు వ్యక్తిగతంగా తాము పైకి రాగల అవకాశాలు లేక పోయినా, ఏ ఇతర స్త్రీ వృద్ధిలోకి వచ్చినా చూసి సంతోషిస్తారు. అందరూ తమలా బాధలు—పడాలని కోరరు. మీనాక్షమ్మ తనకన్నా ఎవరైనా పై మెట్టుకు వెళ్తే సహించలేదు.

ఊరిలోనే కాలేజీ ఉన్నా, మనుమరాలు అందులో చేరతానంటే మొట్టమొదట విశ్వేశ్వర రావుగారు ఒప్పుకోలేదు. జయమ్మకు కూడా అనిష్టంలేదు. అనసూయమ్మ కూతురి మనశ్శాంతి కొరకు కాలేజీలో చేరడానికి ఇష్టపడింది. శ్రీదేవి తన తాతయ్యను ఒప్పించడానికి చాలా శ్రమపడ వలసివచ్చింది. తను ఉద్యోగం చేసుకుని స్వతంత్రంగా బ్రతుకుతాననీ; వేణుకూ, తనకూ విడాకులు యిప్పించమనీ, మళ్ళీ ఒకవేళ వేణు తన వద్దకు తిరిగి వచ్చినా అతనితో కాపురం చెయ్యలేనని స్పష్టంగా శ్రీదేవి, విశ్వేశ్వరరావుగారితో చెప్పింది. దుర్గాప్రసాద్, విశ్వేశ్వరరావుగారూ, శ్రీదేవి—భవిష్యత్తు గురించి ఎంతో ఆలోచించి, చివరకు వేణుతో ఆమెకు విడాకు లిప్పించడానికీ, ఆమెను పై—చదువు చదివించటానికి నిశ్చయించారు. శ్రీదేవి కాలేజీలో చేరుతోందంటే సంతోషించినది ఆమె ఒక్కతే కాదు; శారదా, సుందరమ్మలు ఎంతో సంతోషించారు.

తను ఒక నూత్న ప్రపంచంలోకి ప్రవేశించినట్లుంది; కాలేజీకి వెళ్ళిన మొదటిరోజు. ఎక్కడ చూసినా విద్యార్థులూ, విద్యార్థినులతో, కాలేజీ కలకలలాడుతోంది. తను అంతమందిలో

---

న్యాయవాది: అమ్మయ్యా! ఎలాగైతేనేం కేసు గెలిచింది. అసలింతకీ దొంగతనం చేశావా నిజంగా!

నేరస్థుడు: నిన్నటి మీ వాదన చూసినప్పటినుండి నేను అసలు దొంగతనము చేయలేదను కుంటున్నానండీ.

వాంచారయ్య (సీతానగరం)

---

రోజా తిరగగలదా? అని భయపడింది. లేడీస్ గదిలో తనొక్కర్తీ, కొంతసేపటివరకూ విడిగా కూర్చుంది. చాలామంది యువతులు తమలో తాము మాట్లాడుకుంటున్నారు. ఇద్దరు ముగ్గురు తనలాగే, ఎవరితో మాట్లాడకుండా, అందరివైపు వింతగా చూస్తున్నారు. బహుశా వారు కూడా కొత్తగా కాలేజీలో చేరడానికి వచ్చారేమో. కొంతమంది యువతులు హడావిడిగా లోపలికి వస్తున్నారు; కొంతమంది వెళ్తున్నారు. ఒక్క విద్యార్థిని తప్ప అందరూ చీరలు కట్టుకున్న వారే; ఆమె మాత్రం పరికిణీ, జాకెట్టుమీద వోణి వేసుకుంది. ఆమెది లేత వయసులాగుంది. గుండ్రటి మొహం; రెండు జడలు వేసుకుంది. ఆ అమ్మాయే శ్రీదేవిని పలకరించింది: ''ఫస్టియర్ క్లాసు ఏ గదిలోనో మీకు తెలుసా?'' అని ఆమె అడిగింది.

శ్రీదేవి, తనకు తెలియదనీ, తనూ కాలేజీలో ఫస్టియర్‌లో చేరడానికి వచ్చాననీ చెప్పింది. ఆ అమ్మాయి, తను శ్రీదేవి బి. ఏ. చదువుతోం దను కున్నానని చెప్పింది. శ్రీదేవి నవ్వింది. ఆ అమ్మాయి కూడా నవ్వింది. తరువాత ఆ అమ్మాయి పేరు హేమలత అనీ, రాజమండ్రిలో బాగా పేరు పొందిన డాక్టరు రాజగారమ్మాయి అనీ, ఆమె గురించి శ్రీదేవికి తెలిసింది. వీ రిద్దరూ మాట్లాడు కుంటూండగానే, ఫస్ట్ బెల్ కొట్టారు. అప్పుడు విద్యార్థులంతా క్లాసు — గదులవైపు బయల్దేరారు. ఫస్టియర్ క్లాసు, మెయిన్—హాల్లోనే జరుగుతోంది.

విద్యార్థినుల కోసం వదిలివేయబడ్డ మొదటి రెండు వరుసల బెంచీలలోనూ సుమారు ఇరవై మంది విద్యార్థినులు కూర్చున్నారు. ముఖ్యంగా శ్రీదేవి హాలులోకి ప్రవేశించి, కూర్చునేటప్పుడు విద్యార్థులంతా ఒకరివైపొకరు చూసుకున్నారు.

''మన క్లాసులో కూడా అందమైనవా ళ్ళున్నారోయ్!'' అని వెనక బెంచీల్లో కూచున్న ఒక విద్యార్థి మరొక విద్యార్థితో అన్నాడు.

''కాలేజీ బ్యూటీ మన క్లాసేరా!'' అన్నాడు రెండో విద్యార్థి.

ఇంగ్లీషు—లెక్చరరు, కొత్త విద్యార్థులకు కాలేజీ వాతావరణం గురించి ఉపోద్ఘాత ప్రసంగం చేశాడు. చదువు గురించీ, ప్రవర్తన గురించీ, మంచి మంచి అలవాట్ల గురించీ చాలా చాలా మంచి మంచి మాటలు చెప్పాడు. ఆ లెక్చరుతో ఆ పూట కాలేజీ అయిపోయింది. శ్రీదేవి, లేడీస్ — గదిలోకి వెళ్ళింతరువాత, తన క్లాసు విద్యార్థినులతో పరిచయం చేసుకుంది. మధ్యాహ్నం కూడా ఒక పీరియడు మాత్రమే చెప్పి వదిలేశారు. కాలేజీలో శ్రీదేవిని గురించి రకరకాల విమర్శలు బయలుదేరాయి. ఫస్టియర్‌లో ఒక అందమైన అమ్మాయి చేరిందని తెలిసి, కొందరు ఇతర క్లాసుల విద్యార్థులు, మధ్యాహ్నం ప్రత్యేకం మెయిన్—హాలు వద్దకు వచ్చి ఆమెను చూసి వెళ్ళారు. శ్రీదేవి, తనయందు విద్యార్థుల కింత ఆసక్తి కలిగిందని తెలుసుకోలేక పోయింది.

కాలేజీ నుంచి రాగానే కాఫీ త్రాగి, రజనిని పలకరించి, ఒకసారి పెరటి గోడవద్దకు వచ్చి, శారదా, సుందరమ్మలతో తన కాలేజీ అనుభవమంతా ఉత్సాహంగా చెప్పేసింది శ్రీదేవి. వా రిద్దరూ ఆమె—సంతోషం చూసి, చాలా ఆనందించారు.

నాలుగు రోజులైన తరువాత మెల్లిగా కాలేజీ వాతావరణం అలవాటయింది శ్రీదేవికి. కొత్త పుస్తకాలు చదవడం ప్రారంభించింది. విద్యార్థినులతో పరిచయం వృద్ధి చేసుకుంది. వయస్సులో వారందరి కన్నా పెద్దదవటంవల్లా, అందమైనదవటం వల్లా, విద్యార్థినులకు ఆమే నాయకురాలయింది. అంతేకాక విజ్ఞానంలో కూడా, వా రందరికన్నా ఆమె అధికురాలు. ఫస్టు గ్రూపు తీసుకున్న విద్యార్థిను లందరికన్నా ఆమే చురుకుగా ఉండేది.

లెక్చరర్లు ఏ ప్రశ్న అడిగినా చురుకుగా, చొరవగా జవాబు చెప్తుండేది. అందరూ ఆమెను చాలా గౌరవించసాగారు. ముఖ్యంగా ప్రిన్సిపాలుకు విశ్వేశ్వరరావుగారు బాగా తెలిసియుండడంవల్ల, ఆమెను చాలాసార్లు పలుకరించి ఆదరంగా చూడ నారంభించాడు. ఆమెకు ఏ సబ్జెక్టు తెలియక పోయినా, తనవద్దకు వస్తే, చెప్తానని చెప్పాడు. రోజూ ఒకసారి తన ఆఫీసుకు శ్రీదేవిని పిలిపించి, అయిదు నిముషాలైనా మా ట్లాడి పంపిస్తుండేవాడు. మొదటి నెలరోజులు గడిచేసరికి, శ్రీదేవికి కాలేజీ—జీవితం ఎంతో సరదాగానూ, ఆకర్షణీయంగానూ, ఉత్సాహవంతంగానూ కన్పించసాగింది.

# శ్రీదేవి

తక్కిన విద్యార్థినులంతా ఆమెను ఈర్ష్యతో చూడ నారంభించారు. విద్యార్థులూ, విద్యార్థినులూ కూడా శ్రీదేవిని గురించి వివరాలు సేకరించ సాగారు. ఆమె వివాహితయనీ, భర్తను వదలివేసిం దనీ, ఒక అబ్బాయికూడా ఉన్నాడనీ వారికి తెలిసింది.

రెండు—మూడు రోజులు పరునగా, శ్రీదేవి జట్కామీద కాలేజీకి వస్తూంటే, ఆ జట్కా వెనకాల నలుగురైదుగురు విద్యార్థుల సైకిళ్ల మీద వస్తూ, తనను చూసి ఏవో మాట లను కుంటూ నవ్వుకోడం గమనించింది శ్రీదేవి. మొదట్లో అంతగా పట్టించుకోకపోయినా తరువాత వారు తనను ఏదో అల్లరి చెయ్యాలనే ఆశతో వస్తున్నట్లు గమనించింది. వా రనుకునే మాటలు తన గురించేనని తెలుసుకుంది.

"అబ్బాయికి పాలిచ్చి వచ్చావ ?" అంటున్నాడు ఒక కుర్రాడు. ఆ మాటకి తక్కినవాళ్లంతా గొల్లుమని నవ్వారు. శ్రీదేవికి చాలా ఉక్రోషం వచ్చింది.

"అబ్బాయిని కూడా కాలేజీకి తీసుకురాలేదేం?" మరొకడు, జట్కావైపు చూస్తూ ఆనేసి ముఖం ప్రక్కకి తిప్పుకున్నాడు. "రేపు తెస్తుంది లేరా, రోజూ ఎంతకని తల్లిని వదిలిపెట్టి పిల్ల లుండగలరు ?" అని మరొకడు సానుభూతి చూపించాడు. తక్కినవాళ్లు "అయ్యో! పాపం !" అని అనేసి నవ్వసాగారు.

కాలేజీకి వచ్చేదాకా వాళ్లు ఆ జట్కాని వెంబడిస్తూనే ఉన్నారు. ఏవో మాటలంటూనే ఉన్నారు. శ్రీదేవి—మొహం కోపంతో ఎర్రబారింది. కాలేజీ ఆవరణలో జట్కా దిగి, లేడీస్—గదికి వెళ్లిపోయింది. అపాళ, పాఠం ఆమె మనసుకు సరిగా ఎక్కలేదు. మనసు పరిపరి విధాల పోయింది. వాళ్ల మాటల్ని ఎంత పట్టించుకోవద్దన్నా, మన సుకు తల్చుకొన్నకొద్దీ సూదుల్లా గుచ్చుకుంటు న్నాయి. కొద్దిసేపు వీళ్ల కెలా బుద్ధి చెపాలా అని ఆలోచించింది. ప్రిన్సిపాలుగారితో రిపోర్టు చేస్తే ఆయన తగిన చర్య తీసుకుంటారు. కాని దాని వల్ల ఇంకా అల్లరవవచ్చు. పోనీ ఆ అల్లరి చేస్తున్న వారిని "మీరు ఇలా అమ్మాయిల నేడ్పించడం మంచిదికాదు" అని చెప్తే వింటారా ? తను జీవితంలో ఎన్నో కష్టాలు పడ్డాననీ, తన జీవితాన్ని అభ్యుదయ మార్గంలో పెట్టుకుందామని కాలేజీకి వచ్చింది గాని, విలాసంగా కాలేజీ జీవితంలోని ఆనందం అనుభవించటానికి రాలేదనీ చెప్పుకుంటే వింటారా ! వారి దృష్టిలో ఆమె ఒక అందమైన కాలేజీ విద్యార్థిని! ఆమె నేడిపిస్తే నలుగురిలో తమకు ఘనత. అక్కడికీ శ్రీదేవి తక్కిన అమ్మాయిలవలె ఎక్కువగా అలంకరించుకొని రాదు. ముతక ఖద్దరు—చీరా, రవికె, ఆభరణాలు లేని మెడ, సామాన్యంగా దువ్వుకొనే జడతో వస్తుంది. కాని ఆ దుస్తులలోనే బంగారు వన్నెగల ఆమె శరీరం మెరసిపోతూ ఆకర్షణీయంగా ఉంటుంది. (సశేషం)

# శుభలేఖ

21-వ పేజీ తరువాయి

చదువుకున్నారుకదూ; గోపి వెరుగుదురా" గబగబా అడిగేశాడు.

గోపి—ఫోటో స్మృతి పథంలోకివచ్చింది. కంటి మీద మచ్చ. పోస్ట్‌మన్ టోపీ తీసేశాడు. గుర్తొచ్చింది; అతను గోపీయే.

"మీరు, మీరు.... గోపీయే గదూ" అన్నాను.

"అవునండీ శ్యామలగారూ! థాంక్స్! గుర్తున్నందుకు. మా నిర్మల ఎట్లా ఉంది? ఎక్కడ ఉంటున్నారు? మా మల్లి, నాన్న ఎలాఉన్నారు? నాగురించి నా శ్రేమనుకుంటున్నారు?" అంటూ ఆత్రంగా ప్రశ్నించాడు.

రండి; లోపల కూర్చుందామని కుర్చీ చూపించాను. వంచి అవతల పడేసి కూర్చున్నాడు.

"మూడేళ్ళ క్రిందట నిర్మలను కలుసుకున్నాను. అప్పటికి ఎస్సెల్సి పాసయింది. తరువాత మల్లికి పెళ్ళయినట్టు ఉత్తరం వచ్చింది. మళ్లీ మూడేళ్ళ తరువాత ఈ శుభలేఖ, నిన్న ఉత్తరం. మీ నాన్నగారు ఇప్పటికీ నీ గురించి దిగులు పడుతూనే ఉన్నారు. పెళ్ళికి మీరొస్తే నిర్మల జీవితం ఆనందమయమవుతుంది. తప్పకుండా రండి." అన్నాను.

అతను నాన్నగారిని గురించిన మాటలతో ఉక్కిరిబిక్కిరయిపోయాడు: "నిజంగా మానాన్నగారిని ఎంతో బాధపెట్టానండీ, పెళ్ళికి తప్పకుండా వస్తానండీ" అన్నాడు.

"మరి ఈ ఉద్యోగం...." అంటూ సగంలో ఆపేశాను.

"అవునండీ శ్యామలగారూ! ఏదో స్టేషనులో ఏడుస్తుంటే బోస్టల్ స్కూలో చేర్పించారు పోలీసులు. అక్కడ వంటపట్టినంత చదివి, బయట పడ్డాను. ఇన్ని రోజులుగా మిమ్మల్ని చూస్తున్నాను గాని, గుర్తుపట్టలేకపోయాను." అన్నాడు.

"రేపు నా డ్యూటీ అయిన తరువాత—బండికే వస్తానండీ. నా సంగతి మీరు నిర్మలకు చెప్పకండేం! వరాసరి నేనేవచ్చి ఆశ్చర్యపరచాలి. సరేనా? మరి వస్తానండీ" అంటూ సంతోషంతో సంచి ఊపుకుంటూ వెళ్ళిపోయాడు.

హఠాత్తుగా జరిగిన ఈ సంఘటనకు నేను విస్తుపోయాను. ఇంక కనబడడు అన్న గోపి, తన కళ్ళముందర ఇంతవాడయి కనిపిస్తే మాష్టారి మనస్సెలా ఉక్కిరిబిక్కిరిరవుతుందోనని ఆలోచిస్తుండగా వారొచ్చేశారు.

"సెలవు గ్రాంట్; శ్యామలా రేప్రొద్దుట బండికే రెడీ" అన్నారు హుషారుగా.

"ఏమండీ! ఇంకో విశేషం" అన్నాను.

ఏమిటంటూ ప్రశ్నార్థకంగా చూశారు.

'మన పోస్టుమన్ లేడూ!" అంటూ ఆపాను.

"ఎందుకులేడు? ఉన్నాడు, అయితే" ఆశ్చర్యార్థకంగా మారింది.

"అతనే గోపీ, ఇవ్వాళ శుభలేఖ అందిస్తుండగా తెలిసింది" అంటూ నవ్వాను.

"ఏమిటీ ! మిస్టరీ!" అంటూ కాఫీ గభగబా త్రాగేశారు.

• * •

స్టేషనులో దిగి బండి మాట్లాడుకొని నిర్మల ఇచ్చిన అడ్రసుకు వెళ్ళాము. వాకిట్లోనే నిర్మల మొహమింత చేసుకొని ఎదురొచ్చింది. అది డాక్టర్ మధుగారి యిల్లు. నిర్మల అక్కడెందుకుందో అర్థం కాలేదు. ప్రశ్నలడగడానికి నిర్మల సందివ్వలేదు. ఇల్లంతా పెళ్ళి కళలతో కలకలలాడుతూఉంది. నేనూ, ఆయనా స్నానం చేసేటప్పటికి భోజనాల వేళయింది. భోజనాలు కూడా అయినాయి.

తమలపాకులకు సున్నం రాసుకుంటూ ఆయన అన్నారు: "నిర్మలను పిలిచి సంగతులు కనుక్కో శ్యామలా! నస్పెన్సుతో చంపక."

ఇల్లంతా వెదికి నిర్మలను లాక్కొచ్చాను.

"విశేషాలు ఏమిటి నిర్మలా? నా ఉత్తరానికి జవాబు లేదేమిటి? ఈ మూడేళ్ళుగా ఎక్కడున్నారు? ఈ డాక్టర్ ఎవరు? మాస్టారేరీ నిర్మలా ?" ఆత్రంగా అడిగేశాను.

నిర్మల ఒక్కసారి గంభీరంగా ముఖం పెట్టింది. నేను, మావారు ఆత్రంగా నిర్మలవేపు చూస్తున్నాం.

"అవును శ్యామలా! ఉత్తరాలు వ్రాయలేదు. మల్లి — పెళ్ళయినతరువాత మాకు ఆ వూరితో ఋణంతీరిపోయింది. మల్లిదగ్గర్నుంచి సరిగాఉత్తరాలు రావటంలేదు శ్యామలా! నా చదువు తరువాత కొద్ది రోజులు వూర్కే ఉన్నాను. నాన్న నాకు పెళ్ళి చేయాలని శతవిధాల ప్రయత్నించారు శ్యామలా! ఎటు చూచినా కట్నమనే కందకం దాటరానిదిగా కనబడింది. కష్టపడి నాన్న తీసుకొచ్చిన సంబంధాలన్నీ కట్నందగ్గర విడిసికొట్టేవి. నాన్న ఎంతో కుమిలిపొయ్యేవారు. ఒకసారి నాన్న స్నేహితులు కట్నంతక్కువలో మల్లికి సంబంధం కుదిర్చారు. కాని నాన్నబాధ నాకు పెళ్ళిచేయకుండా మల్లికెలా చేస్తానని. అప్పటికి నాన్న రిటైరయ్యారు. ఉన్న నేల మల్లికోసం అమ్మేస్తే, నా జీవితమెట్లాగని బాధపడేవారు. నా ముందు నాన్న కంటతడిపెట్టిన క్షణాలుకూడా ఉన్నాయి శ్యామలా! ఇంతటి సున్నిత హృదయం గల నాన్నని సుఖపెట్టాలంటే అప్పట్లో నాకు ఒక్కటే మార్గం తోచింది శ్యామలా! మల్లి-పెళ్లికి మనసారా ఒప్పుకున్నాను. నాన్న స్నేహితుడు అతికష్టంమీద పెళ్ళి అయిందనిపించారు. ఆ వూళ్ళో ఇరుగు పొరుగమ్మల పోరెక్కువయింది. మా నాన్నను, నన్నుకూడా వేలెత్తి చూపించేవారు. "ఇదేం చోద్యమమ్మా" అనే మాటలు నా చెవిని కూడా పడ్డాయి. నాన్న ఈ దెబ్బతో మరీ కృంగిపోయారు. మల్లిమొగుడువాళ్ళు మా గురించి ఏమీ విచారించలేదు. దాంతో ఆ వూరొదిలేసి ఇక్కడికొచ్చాము. అదృష్టవశాత్తు తొందరగా నాకొక ఉద్యోగం దొరికింది. నాన్న పెద్దవాడవటంతో ఆయన ఆరోగ్యం క్షీణించింది. మందులకు మాకు లకూ, నా సంపాదన చాలేదికాదు. కాని నాన్నకు సేవచేయడంలో నా కానందం కనిపించేది శ్యామలా! నాన్నమాత్రం:

"అమ్మా! నన్నొదిలేసిన వాళ్ళందరూ బాగుపడ్డారమ్మా! నువుమాత్రం నన్నంటిపెట్టుకుని ఇన్ని కష్టాలు పడుతున్నావుగదామ్మా. కాని నీకు నా ఋణం తీర్చలేకుండా ఉన్నాను నిర్మలా! నేను నిస్సహాయుణ్ణి. అమ్మా! నిస్సహాయుణ్ణి" అంటూ వాపోయేవారు.

"ఇప్పుడేం తక్కువ నాకు" అంటూ ఓదార్చేదాన్ని. డాక్టర్ మధుగారు నాన్నకు మందిచ్చేవారు. మా సంగతి అంతా తనకు తెల్సిని మా దగ్గరేం చర్చించేవారుకాదు. నేను మొదట్లో ఆశ్చర్యపడ్డ










# శుభలేఖ

తరువాత చాలా మంచివాడు అని తెల్సుకున్నాము. నాన్నను ఆయన మాస్టారు అని పిల్చేవాడు. నాన్నకు అలా పిలుస్తుంటే ఎంతో హాయిగా ఉండేదట; నాతో అనేవారు. అలవాటయిన పదంకదూ మరి. ఒకరోజు నాన్నకు విపరీతంగా జ్వరంవచ్చి మాట్లాడ లేకపోయారు. డాక్టరుగారింటికి పరుగెత్తు కుంటూ వెళ్లాను. ఆయన కార్లోనే వచ్చి నాన్నను చూశారు. బయటకువచ్చి "లాభంలేదు నిర్మల గారూ" అన్నాడు. 'అయినా ఉండండి' అంటూ ఒక ఇంజక్షను నిచ్చారు. కాస్సేపటికి కళ్ళు తెరచారు నాన్న. నా సంతోషానికి అంతులేదు.

ఇంతలోకే డాక్టరు "నిర్మలగారూ మీరు ముందుకు నా వెంబడి రావాలి" అన్నారు.

ఆయన కార్లోనే వెళ్ళాను. కూర్చోమని కాస్సేపు మౌనంగా వూరుకున్నారు. "డాక్టరుగారూ" నేను ఆత్రంతో పిలవటంతో:

"నిర్మలగారూ! నేను డాక్టరు మధునుగాదు మాధవాయిని. మీ నాన్నగారి తరగతిలో ఎక్కువగా అల్లరిచేసేవాణ్ని. కాని నేను తెలివిగలవాణ్నని ఆయన కొక నమ్మకముండేది. అందుకని నన్ను ఏమీ అనేవారుకాదు నిర్మలగారూ! తరువాతనే డాక్టరీ ప్యాసయ్యాక మీ వూరి కొచ్చినప్పుడు మాస్టారుని గురించి, [illegible]రించి తెలుసుకుంటూండే వాణ్ని. డాక్టరు—అం[illegible] తరువాత ఆయన నన్ను గుర్తుపట్టలేదు కాని, నేను ఆయనను మాత్రం మాస్టారూ అని పిలిచేవాణ్ని. నన్ను గుర్తుపట్ట గలరా నిర్మలగారూ" అన్నారు ఉద్వేగంతో:

"గుర్తుంది డాక్టర్! గుర్తుంది" అన్నాను ఆశ్చర్యంతో. మళ్ళీ డాక్టర్ అన్నాడు "మీ నాన్న మీపెళ్ళి మీ చెల్లి—పెళ్ళికన్న ముందు చెయ్యా లని పడ్డ బాధ నాకు తెల్సు నిర్మలగారూ. కాని అప్పట్లో నేనేమీ చేయగలిగిందిలేదు. మీకేం అభ్యంతరం లేకపోతే నేను ఇప్పుడు మిమ్మల్ని పెళ్ళిచేసుకుం టాను; ఏమంటారు" అని నాతట్టు ఆత్రంగా చూశారు.

"థాంక్స్ డాక్టర్! మా నాన్ననడిగొస్తాను డాక్టర్" అంటూ పరుగెత్తుకు వెళ్ళిపోయాను.

నాన్న కొనవూపిరితో ఉన్నారు.

"వచ్చావా అమ్మా! డాక్టర్ ఎందుకమ్మా రమ్మ న్నారు" అన్నారు ఆయాసపడుతూ. సంగతి వివరించాను.

"నిజంగానా అమ్మా! అదృష్టవంతురాలివమ్మా! ఇన్నాళ్ళు పడ్డకష్టాలు గట్టెక్కాయమ్మా నీకు. నేనేమీ నీకు చెయ్యలేకపోయినా భగవంతుడు నాకు అపవాదు రాకుండా.... చేశాడమ్మా! నా ప్రాణం హాయిగా పోతుందమ్మా! నిన్నింకా కష్టపెట్ట లేనమ్మా" మీ అన్నయ్యఉంటే ఎంత సంతోషిస్తాడో అమ్మా..... ఈ మాటకు. ఎక్కడున్నా కనబడ్తా డేమో, గోపీ అంటూ పోయాడని చెప్పమ్మా.... నిన్నింక కష్టపెట్టనమ్మా .... కష్టపెట్టను" అంటూ కన్నుమూశారు.

"అదీ శ్యామలా జరిగింది" అంది నిర్మల.

"నాన్నా" అనే కేకతో అందరం అదిరి పోయాము. గోపి చేతిలోని చీర పాకెట్టు—జారి నిర్మల ఒళ్ళో పడింది. ★

# ఆశా జ్యోతి

18-వ పేజీతిరువాయి

స్వేషం వచ్చింది. అసలు కారణమేమిటో ఎవరికీ అంతుపట్టలేదు. "ఎక్కడైనా— యింతకన్నా పెద్ద చేపర్ని వలలో వేసిందేమో ? ఆడది చేయ దల్చుకుంటే చేయలేని దేముంది—?" అన్నాడు చలపతి లంచ్ టైములో. 'ఏమో, చూస్తే నా కలా టదిలా కనిపించలేదు చలపతీ" అన్నాడు పద్మ నాభం, లంచ్ టేబులు దగ్గర ఏ మాటైనా ఏక గ్రీవంగా పారుతుంది అనే సత్యాన్నితోసివేస్తూ "అబ్బో ఒక ఊపు—ఊపి చూసినట్లున్నావే ?" తిరిగి ప్రశ్నవేశాడు చలపతి. "అన్నమంతా పట్టిచూడా లిటోయ్; మెతుకు చూస్తే తెలీదు?" అన్నాడు పద్మనాభం. మధ్యాహ్నం చలపతి, ఆఫీసుబాయ్ దగ్గర కాపీ తీసి, కొద్దో గొప్పో విషయ సేకరణ చేశాడు. మేనేజరూ, రజనీ ఘర్షణ పడ్డారనీ— అందుకని ఆమె రిజైన్‌చేసి వెళ్ళిందనీ. "వాడు వట్టి బ్రూట్‌రా పద్మనాభం! కాకపోతే ఆడదానితో ఘర్షణ పడటమేమిటి—ఆఫీసు మళ్ళీ పాడి అయి పోతుంది సుమా—" అన్నాడు ప్రకాశం.

* * *

నెలరోజులు యిట్టే గడిచిపోయిన్నై, ఒకరోజు సాయంత్రం— పరాకుగా రోడ్డుమీద నడుస్తున్న శంకరానికి— తనని ఎవరో ఆడవాళ్ళు వెనకాల నుంచి— బిగ్గరగా పిలవటం వినిపించి ఆగిపోయాడు. అతనితోబాటు అతని ఆలోచనలుకూడా ఆగిపోయిన్నై. అప్పుడే రోడ్డుమీద దీపాలు వెలిగిన్నై. ఎవరో అపరిచితురాలిని చూసినట్లుగా చూశాడు రజనిని శంకరం. "నేనండీ— శంకరంగారూ— మీ ఆఫీ సులో స్టెనోగ్రాఫరుగా పనిచేశాను—" అన్నది ఆమె— శంకరంలో వీస మెత్తయినా మార్పులేక పోవటం చూచి. అప్పటికి శంకరం మనసులో ఏదో మెమరువేసుకొని— "అవును— యివాళ వంట్లో బాగుండక ఆఫీసుకు రాలేదు. సెలవుచీటీ పంపుదా మంటే, వచ్చేవాళ్ళెవరూ లేక పంపనేలేదు. మేనే జరుగారు గాని కేకలేశారా ?" అన్నాడు బెరుకు బెరుకుగా. అతని జడత్వానికి—సామాన్యంగా కలుగ వలసిన చిరాకు రజనిలో కలుగలేదు—"అయ్యో ! వంట్లో బాగుండకపోతే, యిలా చల్లగాలిలో తిరుగు తారా ?" అన్నది రజని. శంకరం యిప్పుడు తలెత్తి ఆమెవంక చూశాడు. అతని చేతుల్లో ఏదో మందు సీసా ఉంది. అతనేదో అంటాడని ఎదురు చూసింది రజని— అతను మాట్లాడకుండా తలవంచుకు నడు స్తున్నాడు.

అతని వెనకాల ఆమె నడుస్తున్నది. తనతో ఒక వ్యక్తి నడుస్తున్నదన్న విషయం మరిచిపోయి అతను మలుపు తిరిగి ఒకసందులో కొచ్చాడు. అతన్ని పలుక రించటానికి రజని విఫల ప్రయత్నం చేసింది. నాలు గడుగులు వేసి ఒక యింట్లో ప్రవేశించాడు శంకరం. రజని అతని వెనకాలే లోపలికి వెళ్ళింది. గది—తాళం తీస్తూ, వెనక్కుతిరిగినప్పుడు ఆమె కనిపించింది. "ఓహో—" అన్నాడు శంకరం. ఇద్దరూ గది లోపలికి వచ్చారు. గది నానా చిందర వందరగా ఉంది. ఎప్పుడూ చిమ్మిన పాపాన పోకపోవటానేమో మడమ సీలందాకా దుమ్ము పేరుకుని ఉంది. శంకరం తనవంక తిరిగి చూచినప్పుడు రజని చిరునవ్వు నవ్వింది. ఆ నవ్వుకు ప్రపంచంలో లొంగిపోనిది లేదు. శంకరం అది గమనించలేదు. గ్లాసులో మందు పోసుకు త్రాగబోయాడు. చెయ్యి వణికి గ్లాసు క్రింద పడిపోయింది. నేలమీద చెత్త కుప్పలా ఉన్న పక్క మీద కూలబడిపోయాడు. దగ్గరికి వచ్చి అతని వంటి మీద చేయివేసి చూసింది రజని. సంసల కాగి పోతున్నది వళ్ళు. ఆమెవంక వింతగా చూశాడు శంకరం. అతన్ని మందు త్రాగించి పడుకోబెట్టింది రజని. బాగా పొద్దుపోయింది. కాఫీ తెచ్చిస్తానని అన్నది—శంకరం ధ్యాస యిటువైపు లేదు. మగత నిద్రలోకి మారినట్లుంది. ఇంటికి వెళ్ళటానికి లేచింది రజని. చప్పుడికి కళ్ళు తెరచి చూచాడు శంకరం. మళ్ళీ రేపు వస్తానని చెప్పి బయటికి వచ్చింది ఆమె.

మర్నాడు రజని వచ్చేటప్పటికి శంకరం యింటి దగ్గరలేడు. ఆమె అతనికోసం చాలాసేపు ఎదురు చూసింది. ఇక వెళ్ళిపోవాలనుకుంటుండగా రిక్షాలో దిగాడు శంకరం. ముఖమంతా పీక్కుపోయింది. బాగా నీరసపడిపోయాడు. రిక్షావాడి సాయంతో గదిలోపలికి వచ్చి పక్కమీద కూలబడ్డాడు. అప్పుడు అతని చూపులు రజనిమీద ఆగిన్నై. "ఓ—ఎంత సేపైంది మీరొచ్చి— మీరొస్తారన్న ధ్యాసేలేదు నాకు—" అన్నాడు ఆమెతో.

సూటిగా మాట్లాడటం అదే అతనికి మొదటి సారి. రజని ముఖం యింత చేసుకుని అన్నది— "ఎంతోసేపు కాలేదు. ఇప్పుడు మీ వంట్లో ఎలా ఉంది ?" ఇంతలోనే శంకరం మళ్ళీ పరధ్యానంలో పడిపోయాడు. ఒక్కక్షణం ఆగి, "ఇవాళ సెలవు చీటీ పంపాను—అందిందాండీ—" అన్నాడు. రజనికి శంకరంమీద కోపంవచ్చింది. ఇతనికి ఇరవై నాలుగు గంటలూఆఫీసు—గొడవతప్ప యింకొకటి లేదల్లేఉంది —అనుకున్నది. అయినా మతిమరుపేమిటీ ఈమనిషికి లేక చెముడా ? "నే నిప్పుడా ఆఫీసులో పనిచేయ టంలేదండీ— రిజైన్ చేశాను—" కొంచెం బిగ్గ రగా అతనికి వినబడాలన్నట్లు అన్నది రజని. శంక రం ఒక్కసారి ఉలిక్కిపడి ఆమె ముఖంలోకి చూశాడు. అంత బిగ్గరగా మాట్లాడినందుకు రజని సిగ్గుపడింది. "ఏం ? ఎందుకు రిజైన్ చేశారు ?" అన్నాడు శంకరం. అతనిలో కుతూ హలం పొడసూపినట్లయింది. రజని తృప్తిగా అతనివంక చూసింది. "అదంతా ఒక పెద్ద కథ— మీకు కులాసా చిక్కింతరువాత ఏదో ఒకరోజు చెబుతాను— నా కెక్కడైనా ఉద్యోగం చూసి పెట్టా ల్సిన బాధ్యతకూడా మీ మీదుంది—"అన్నది మాటకు మాట తూచినట్లు. శంకరం ఆశ్చర్యంగా ఆమెవంక చూశాడు. ఏదో అడగబోయి ఆగిపోయాడు. రజని అతని చూపులో చూపు కలిపి — "ఏం ? ఇప్పించరా ?" అన్నది. శంకరం వెంటనే సమాధానం చెప్పలేదు. చూపు మార్చుకొన్నాడంతే. అతను ఆలోచిస్తున్నాడని రజని పసిగట్టింది. అదే ఆమెకు కావలసింది— అతని సమాధానంకాదు.

రజని వెళ్ళిపోయింది. కాని,శంకరం ఆమెనుగురించే ఆలోచిస్తున్నాడు. ఆమెను గురించి జాలిపడు తున్నాడు. ఇంత నగరంలో ఉద్యోగం లేకపోతే గడవ టం ఎట్లా ? అందులో ఆడది— అబల—ఎవరు సాయంచేస్తారు—అని ఆలోచనలో పడ్డాడు, వారం రోజుల తరువాత రజని వచ్చి రాగానే, "మీ సంగతే అనుకుంటున్నాను. నేనే వద్దామనుకుంటే, యిల్లు తెలిక రాలేకపోయాను." అన్నాడు. "ఇప్పుడు మీ వంట్లో ఎలా ఉంది ?" అన్నది రజని; అతనేదో

## ఆశాజ్యోతి

చెప్పటానికి ఆతృత పడుతున్నాడని తెలుసోంది కూడా. "నా ఆరోగ్యం సంగతికాదు; మీ ఉద్యోగం సంగతి. మొన్న ఓపత్రికలో యీ ఎడ్వర్‌టయిజ్‌మెంటు పడింది. మీరు చూశారో లేదోనని—," ఓ పుస్తకంలోనుంచి చిన్న కటింగ్ తీసి ఆమెకిచ్చాడు శంకరం. ఆమె అది చదువుతూ "చాలా థాంక్సండీ. నేను చూడనేలేదు. మీ చేతి చలవవల్ల ఏదన్నా ఉద్యోగం దొరికితే బాగుండు. ఇంటిల్లిపాదీ నా సంపాదనమీదే ఆధారపడిఉన్నారు" అన్నది గది నలుమూలలకు ఆశ్చర్యంగా చూస్తూ. మొదటిసారి తను చూచినప్పటికన్న గది కొంచెం శుభ్రంగా కనిపించింది. తను కూచున్న కొత్తస్టూల్‌ను కొత్తగా చూచింది ఆమె. శంకరం—చూపులు వెన్నాడుతూనే ఉన్నై. "మీరు వస్తే కూర్చోటానికైనా చోటు లేదు. నిన్ననే కొన్నాను స్టూలు—"అన్నాడు శంకరం— తనేదో తప్పిదం చేసినట్లు.

ఇంటికి తిరిగివెళుతూ రజని అనుకొన్నది: ఇతరులను చూచి జాలిపడటం నేర్చుకొన్నాడు శంకరం. ఇక అతను మనుషుల్లో పడటానికెంతో కాలం పట్టదు. అతనిలో ఆత్మాభిమానమొక్కటే యిక తక్కువ. శంకరం ఇచ్చిన పేపర్—కటింగ్ ఇంకా ఆమె చేతుల్లోనే ఉంది. దానివంక చూచి ఒక చిరునవ్వు నవ్వి నలిపివేసింది. అసలు ఆమెకు ఉద్యోగం కావలసివస్తేకదా ? ఆమెకు మనసులో అనేక ఆలోచనలూ, ఊహలూ రేగుతున్నై. శంకరంలో ఆ జడత్వాన్ని కలుగజేసింది ఆ ఆఫీసే. అతనిలో ఉత్సాహాన్నీ శక్తినీ, ఔత్సుకతనూ పూర్తిగా నలిపివేసిందికూడా ఆ ఆఫీసులో పనేనేమో. శంకరం నిరాశావాది — అతనలాగే ఉంటే, అతని జీవితమంతా నాశనమై పోతుంది అనుకున్నది రజని.

నాలుగు రోజుల తరువాత బస్‌స్టాపు దగ్గర అనుకోకుండా కనుపించాడు శంకరం. ఆఫీసునుంచి తిరిగి వస్తున్నట్లున్నాడు. రజని చూచీ చూడనట్లు ముందుకు వెళ్ళిపోయింది. శంకరం ఆమెను చూచి గబగబా నడిచి వచ్చాడు. అతన్ని చూచి రజని అన్నది "చాలా థాంక్సండీ. మీరు చూపించిన ఎడ్వర్‌ట్‌యిజ్‌మెంట్ తాలూకు ఉద్యోగం నాకు దొరికింది—రోజూ వచ్చి చెబుదామనుకుంటూనే— ఆఫీసు ఉండడం వల్ల కుదరటంలేదు. వచ్చే ఆదివారం 'టీ' పార్టీ ఏర్పాటుచేశాను. మీరు తప్పక రావాలి." "ఎక్కడ ? మీ ఇంట్లోనేనా ? మీ యిల్లెక్కడో నాకు తెలిసే తెలీదుకదా ?" అన్నాడు శంకరం.

రజని నవ్వి— "ఇదుగో, ఇప్పుడు చూపిస్తాగా" అన్నది. ఇద్దరూ రజని—యిల్లు చేరేటప్పటికి బజారులో దీపాలు వెలిగినై. ముందు—గదిలో అతన్ని కూర్చోపెట్టి ఐదు నిముషాల్లో కాఫీకప్పుతో వచ్చింది రజని. శంకరం మొదట మొహమాట పడినా, కాఫీ తీసుకొని "ఇంతకూ మా ఆఫీసులో ఉద్యోగం ఎందుకు మానేశారో చెప్పనేలేదు—" అన్నాడు.

రజని అతనివంక ఆశ్చర్యంగా చూచింది. అతను ఆమెను దీక్షగా చూస్తున్నాడు. మొదటిసారిగా, అతన్ని చూచిన ఆమె—ముఖం సిగ్గుపడింది. ఎటో చూస్తూ అన్నది రజని— "ఆడవాళ్ళకు తగిన గౌరవ మీయులేని మేనేజర్లక్రింద పనిచేయటం నా కలవాటులేదండీ. తింటానికి కూడున్నా లేకపోయినా అవమానం భరించటం కష్టం—మీరు కాబట్టి యింకా అది అంటిపెట్టుకున్నారు కానీ—" ఆమె అలా తనని ఎత్తిపొడవటంతో శంకరంలో ఆత్మాభిమానం పొడుచుకువచ్చింది. ఏదో అనబోయి ఆమెవంక చూచాడు. ఆమె పెదవులమీద చిరునవ్వు చిందులాడుతున్నది.

క్రుంగిపోయి అతనన్నాడు: "ఆ ఉద్యోగం వదిలితే, నా కింకే ఉద్యోగం దొరుకుతుందండీ? ఎందుకూ కొరగాని అసమర్థుడిని. అసలు ఏ ఉద్యోగమూ నేను చేయలేనేమో— చేయకపోతే గడవదు జీవితం. ఇంకా వీళ్ళు కాబట్టి నా తప్పులన్నీ భరిస్తున్నారు. ఇంకెక్కడన్నా అయితే—" అప్పటిదాకా బుద్ధిగా వింటున్నదల్లా రజని అతని మాటల కడ్డొస్తూ అన్నది— "ఎన్నైనా చెప్పండి. నేను మటుకు ఆ చిత్రవధ ననుభవిస్తూ అలా పడుండేదాన్నికాదు. ప్రపంచం విశాలమైనది. మనల్ని మనం చంపుకు ఉద్యోగంచేసి పొట్టలు నింపుకోటం ఎందుకూ ? అసలు మీకెందుకంత నిరాశ ? ఆడదాన్ని నేను ధైర్యంగా బ్రతకలిగి, మీరు బ్రతకలేరా? ఆ వాతావరణంలో ఇంకా ఎంతో కాలం ఉంటే మనిషిలోఉన్న గొప్పతనం అణిగిపోతుంది. మీలో లోపించినవి ఉత్సాహం, ఆశావాదం. అవే ఉంటే, ఈ ఉద్యోగమే కాదు; ఏ ఉద్యోగంలోనైనా రాణిస్తారు మీరు. లేకపోతే—" శంకరం, ఆమె చెబుతుంటే మంత్రముగ్ధుడిలా వింటున్నాడు. "తెలీని వాళ్ళెవరైనా మిమ్మల్ని చూస్తే, జడుడిక్రింద భావిస్తారు. మీలో శక్తిలేదా? తెలివితేటలు లేవా ? భవిష్యత్తులేదా? అన్నీ ఉన్నై. చూచి—చూచి మీరే వదులుకుంటున్నారు వాటిని...." శంకరం ఏమీ మాట్లాడలేదు. ఐదునిముషాలు కూర్చుని లేచి వెళ్ళిపోయాడు. నాలుగడుగులు వేసి వెనక్కి చూసిన అతనికి చిరునవ్వులు చిందిస్తూ నిల్చున్న రజని కనిపించింది. అతని హృదయంలో ఆ చిరునవ్వులే నిండిపోయి పుష్పించినై.

మర్నాడు ఆఫీసుకు వచ్చిన శంకరాన్ని చూచి అందరూ ఆశ్చర్యపడ్డారు. చక్కగా క్రాపు చేసుకుని నున్నగా దువ్వుకున్నాడు. అతని పొడవైన ముక్కుక్రింద మీసకట్టు నిగనిగలాడుతున్నది. మాసిపోయి అసహ్యంగా ఉండవలసిన పాంటూ, షర్టుల స్థానంలో ఎప్పుడో కుట్టించి పెట్టె అడుగున అణిగిపోతూ నేటికి బైటికి వచ్చిన ఉలెన్‌పాంటూ, సిల్కుషర్టూ, కొట్టవచ్చినట్లు కనిపిస్తున్నై. ఐదునిముషాలు ఆలస్యంగా వచ్చిన అతన్ని ఆశ్చర్యంగా చూస్తున్న తోటి గుమాస్తాల చూపుల్ని నిర్లక్ష్యంగా చూస్తూ జేబులోనుంచి గోల్డ్‌ఫ్లేక్ సిగరెట్టు తీసి వెలిగించాడు శంకరం. ఇంతలో, లోపలినుంచి పిలుపు వచ్చింది. శంకరాన్ని చూచి ఒక్కక్షణం ఆగి, మేనేజరు అన్నాడు.... "నేనే నీ పరిస్థితిలో ఉంటే— ఏం చేసేవాడినో తెలుసా ?—" అతన్ని పూర్తి చేయనీకుండా, శంకరం అన్నాడు: "ఈ ఉద్యోగానికి రాజీనామా చేసిఉండేవారు. నేనూ అదే పని చేస్తున్నాను. ఇదుగో నా రాజీనామా—"అన్నాడు; పాంటుజేబులోనుంచి కాగితం తీసి యిస్తూ—

మధ్యాహ్నమల్లా తెగతిరిగిన శంకరం సాయంత్రం, రజని ఇంటి—తలుపు తడుతూ, తీయటానికి వస్తున్న రజనిని చూసి—"నేను రిజైన్ చేశాను రజనీ" అన్నాడు ఠీవిగా, హుందాగా. ఆమె పెదవులమీద చిరునవ్వు వెలిగింది. ★

# భ్రష్టయోగి

12-వ పేజీ తరువాయి

డుకు కాదుగా యిక్కడ నుంచున్నది ? అందరితో పాటు, పామున్నూ, పాములవాణ్ణీ చూస్తూ నుంచున్నాను'' అన్నాడు.

పోలీసు, జనం—వెనక బిక్కుబిక్కుమంటూ కూర్చునిఉన్న సింగన్నవంక తిరిగి, ''అంతా ఈ వెధవల మూలాన్నే....రోడ్లపక్కన యిటువంటి బిచాణాలు పెట్టి మా ప్రాణాలు తీస్తారు..'' అంటూ ఒక అడుగు ముందుకేసి, కోపంతో, ''ఒరేయ్ ! నువ్వు మూటాముల్లే సర్దుకుని బయల్దేరు.... మళ్లీ యిక్కడెక్కడైనా పరిచావంటే కాళ్లు విరక్కొడతాను.... ఊఁ లే'' అన్నాడు.

సింగన్న ''నా తప్పేంఉంది నాయనగోరూ ! వేరు—ముక్కలమ్ముకుని బతికేవోణ్ణి....'' అంటూ ముందుకు అడుగువేసిన పోలీసును చూసి భయంతో ఆగిపోయాడు.

''నీ వేరూ, నువ్వూ గంగలో కలవండి. ముందా బుట్టలు నెత్తికెత్తుకో.... నేను సాయంకాలం దాకా ఈ రోడ్లమీదే తిరుగుతుంటాను. ఈ పరిసరాలలో ఎక్కడైనా మళ్లీ కనిపించావంటే ఈ రాత్రి అంతా స్టేషనులో అట్టేపెట్టి మక్కెలిరగ తన్నిస్తాను.... జాగ్రత్త....'' అన్నాడు పోలీసు.

సింగన్న రెండు పాముల—బుట్టలనూ నెత్తిమీద పెట్టుకొని, వేరుముక్కల సంచి బొడ్లో దోపుకుని, 'ఉస్సుర'ని నిట్టూర్చి బయలుదేరాడు. అప్పటికే అక్కడి జనంలో చాలామంది ఎటు వాళ్లటు పోయారు.... డబ్బు పోగొట్టుకున్న పెద్దమనిషికూడా గొణుక్కుంటూ నెమ్మదిగా కదిలి పోయాడు.

* * *

పొద్దెక్కుతున్నది..... సూర్యబింబం కాలిన పెనంవలె జ్వలిస్తూ నిప్పులు కురిపిస్తున్నది.... గడ్డు—చలిరోజులే అయినా, పొద్దెక్కే కొద్దీ సూర్యుడు తీక్షణంగా ప్రకాశిస్తున్నాడు. ఎముకలు కొరికే చలి అంతా రాత్రిపూటనే....

సింగన్న ఎడమ చెయ్యి కళ్ల కడ్డంపెట్టుకుని చూసి, ''అబ్బో ! చాలా పొద్దెక్కిందే'' అన్నాడు. అతడికి నీరసంగా ఉంది. పొద్దున్న ఎప్పుడో తిన్న రెండిడ్లీలూ, త్రాగిన టీనీళ్లూ యింకా పొట్టలో అలాగే కూర్చుని ఉన్నాయా ? .... కరకర ఆకలి వేస్తున్నది. నీరసంచేత కళ్లముందు నల్లని మచ్చలేవో కదులుతున్నాయి.

అతడు నిట్టూరుస్తూ ఒక నిద్రగన్నేరు చెట్టు నీడను కూర్చున్నాడు. పాముల—బుట్టలను తన పక్కనే పదిలంగా ఉంచుకుని వాటిమీద చెయ్యి ఆన్చి కూర్చుని ఆలోచనలో పడ్డాడు.—

అత డిప్పుడు తన పల్లెటూరికి ఆరుమైళ్ల దూరంలో ఉన్నాడు. ఆ ఊళ్లో తన పాకలో గంగి ఒళ్లెరగని జ్వరంతో నాలుగు రోజులనుంచి మూసిన కన్ను తెరవకుండా పడిఉన్నది .... ప్రతి రోజూ తను యింటికి వెళ్లగానే నవ్వుతూ ఎదురు వచ్చి (ఆ నవ్వు చూడగానే అతని బడలిక అంతా మాయమై పోయేది పాకలోపలికి తీసుకువెళ్లి వేడివేడి నీళ్లు తోడి, స్నానం కాగానే, వేడివేడి అన్నం ఒడ్డించేది. రెండు—మూడు రకాల కూరలతో అవన్నీ యింట్లో ఒండుకున్నవి కావు .... గంగి పనిచేసే యిళ్లలో ఎందరో అమ్మలక్కలను బతిమాలి తెచ్చినవి....) కడుపునిండా కొసరి తినిపించేది .... ఆ తర్వాత పుచ్చపువ్వు వంటి చల్లని వెన్నెలలో ఆరుబయట నులక మంచం వాల్చుకుని పడుకుంటే, ప్రాణాలెటు షికారు వెళ్లేవో! అలా పడుకుని గంగితో కబుర్లు చెబుతూ, నవ్వుతూ, నవ్విస్తూ ఉంటే, 'ఇక బతుక్కి కావలసిందేమున్నద'ని అనిపించేది. పొద్దున్న లేచింది మొదలూ ఇరవైనాలుగ్గంటలూ డబ్బుకోసం పాకులాడే ఈ మనుషు లందరికంటె, తాను సుఖంగా ఉన్నాననుకునేవాడు.... గంగి ఎన్నడూ 'తలనొప్పి' అని కూడా ఎరగదు... అటువంటి గంగి నాలుగు రోజుల క్రిందట అతడింటికి వెళ్లేసరికి మూలుగుతూ పడుకుని ఉంది. అడుగుల చప్పుడు విని, బరువుగా కనురెప్ప లెత్తి చూసి, 'నీళ్లు పోసుకోమనీ', 'అన్నంపెట్టుకు తినమనీ', సైగ చేసింది .... 'ఏటి ? అలా తొంగున్నావు ?' అని అతడు దగ్గరికి వెళ్లి నుదుటిమీద చెయ్యి వేస్తే చురుక్కుమన్నది .... 'అరాత్రి ఎలాగో తగ్గుతుంది లెమ్మ'ను కుంటే తగ్గనే లేదు. మర్నాడు అతడు ఆ ఊరి వైద్యుణ్ణి పిలుచుకు వద్దామని వెళ్లాడు. ఆయన అలోపతీ, ఆయుర్వేదమూ, హోమియో .... అన్ని రకాల వైద్యాలూ తెలిసిన మనిషి. చాలాసేపు అతన్ని నిలబెట్టి, మిగిలినవాళ్లను శ్రద్ధగా పరీక్షలు చేస్తూ రెండు గంటలు గడిపా డాయన ! అక్కడికి వచ్చిన వారందరూ గంగిలా విపరీతంగా బాధపడిపోతున్న వాళ్లు కాదు .... కొంతమంది మామూలుగానే ఉన్నారు కూడా .... అయినా వాళ్లు డాక్టరు దగ్గరికి ఎందుకు వచ్చారో సింగన్నకు అంతుబట్టలేదు. చివరకు ఆయన అందర్నీ పంపించి లేస్తూ ''నేను రావాలిట్రా ? నీ పెళ్లాన్నే యిక్కడికి తీసుకురాలేక పోయావా ?'' అని అడిగాడు. సింగన్న దణ్ణంపెట్టి ''కదల్లేకుండా ఉంది బాబూ ! లేకపోతే, తమకి కష్టం కలిగిత్తానా .... '' అన్నాడు. ఆయన వచ్చి, గంగిని పరీక్షించి ఒక గాజు గొట్టంతో జ్వరం కొలిచి 'అబ్బో' అని తల ఊపాడు. తర్వాత తన సంచిలోనుంచి మందులు తీసి కలిపి, నాలుగు పొట్లాలిచ్చి వెళ్లి పోయాడు. సింగన్న గంగి—పక్కనే కూర్చుని డాక్టరు చెప్పిన ప్రకారం వేళకు మందు నీళ్లలో కలిపి యిచ్చాడు. కాని జ్వరం తగ్గలేదు. మూడు రోజుల మందూ అయిపోయింది. ఆయన చివరిసారి నిన్న రాత్రి వచ్చి, ''లాభంలేదురా సింగన్నా! నీకు డబ్బు—ఖర్చు లేకుండా చెయ్యాలని చూశా నిన్నాళ్లూ ! కాని యిక యింజక్షన్ యివ్వాలి.... తప్పదు. లేకపోతే ఈ జ్వరం యింతలో తగ్గదు. రేపు ఈ మందులు కొనుక్కురా .... '' అన్నాడు చీటీమీద ఏదో వ్రాసి యిస్తూ. సింగన్న జాగ్రత్తగా, ఆ చీటీ అందుకుని ''ఎంత ఖరీదవుతాయి బాబుగారూ'' అని అడిగితే, ఆయన వెనుదిరిగి మూడు రూపాయ లుంటుందేమో'' అని చెప్పి వెళ్ళిపోయాడు.

ఆలోచనలో పడిఉన్న సింగన్న—కాలిమీద చీమ కుట్టింది. అతడు ఉలిక్కిపడి దాన్ని దులిపేసి నిట్టూర్చి ''మూడు రూపాయలు .... '' అనుకున్నాడు. మూడు రూపాయలు తన కెలా వస్తాయి? పొద్దున లేచింది మొదలూ చెట్లూ పుట్ట వెంబడి అడవుల్లో తిరిగి, వేరు సంపాయించి దాన్ని ఊళ్ల వెంబడి తిరిగి ఒక్కొక్కటి బేడ డబ్బులకు అమ్ముకుంటూ జీవయాత్ర సాగిస్తున్నాడు తను. తనకు ఒక్కరోజులో మూడు రూపాయలెక్కడినుంచి వస్తాయి ? తన దగ్గర ఉన్న వేరుముక్క వాసన—కూడా పాములకు సరిపడదు. ఆ వాసన తగిలితే చాలు; ఎటువంటి పామైనా తల వంచుకుని తప్పుకుని వెళ్లిపోతుంది. పాము కరిచినా, తేలు కుట్టినా, మరే యితర విషప్రాణి కాటు వేసినా, యిక చెప్పనే అక్కర్లేదు. ఆ వేరు సంజీవిలా పనిచేస్తుంది. అంత ఉపయోగకరమైన అమృతంవంటి ఆ వేరు—ముక్కను బేడ డబ్బులకు జనం ఎందుకు ఎగబడి కొనరో అతని కర్థం కాలేదు.

ఇంతలో ఆ వీధిలో ఒక ఊరేగింపు వచ్చింది. సింగన్న ఆదుర్దాగా లేచి చూచాడు. ఖాకీ పంట్లాములూ, ఖాకీ—చొక్కాలూ, తలమీద టోపీలూ, బరువైన బూట్లూ ధరించి అన్ని కాలేజీల, స్కూళ్ల ఎన్. సి. సి. పిల్లలు 'మార్చ్' చేస్తూ వస్తున్నారు. వారి బరువైన బూట్ల చప్పుడు శ్రుతిపేయంగా వినవస్తున్నది. సింగన్న ''ఈళ్లు మిలట్రీవోళ్లు కాబో'' లని తనలోతా నను కున్నట్టు పైకి అన్నాడు. పక్కన నిలబడిఉన్న పెద్దమనిషి నవ్వి, ''వీళ్లు మిలటరీవాళ్లు కాదు; చదువుకునే పిల్లలు. యుద్ధం జరుగుతున్నది కదూ ? అవసరమైతే వీళ్లూ యుద్ధంలోకి వెళతారు....'' అన్నాడు.

సింగన్న యుద్ధం అనే మాట విని, ఉలిక్కిపడ్డాడు. అతని అన్న ఒకడు యుద్ధంలోనే చచ్చిపోయాడు. అతని తల్లి యుద్ధంలో బలైపోయిన పెద్దకొడుకును గురించే దిగులుపడి కళ్లు పోగొట్టుకుని ఆ వ్యథతోనే చచ్చింది. ఇప్పుడు మళ్లీ యుద్ధమా ? సింగన్న ఆదుర్దా



''అవ్మా, బంగాళదుంప వేపడం చేసుకుంటే కొంచెం పెడతారూ.......''

దేశ రక్షణకై ఆయుధాలు
ఎంత అవసరమో ఉత్పత్తి కూడా అంత అవసరమే!

కొద్దీ ఆ పెద్దమనిషిని ఆపి, "యుద్ధం ఎవరితో బాబూ?' అని అడిగాడు. ఆయన ఆగి, సింగన్న కళ్లలోకి చూసి, చైనావాళ్లు మనమీదికి దండెత్తి వచ్చారు కాదుటయ్యా ! నాలుగు రోజులనుంచీ సరిహద్దుల్లో యుద్ధం జరుగుతున్నది. మన సైనికు లిప్పటికే కొన్ని వేలమంది చచ్చి పోయారు కూడా. యుద్ధం జరిగే చోట్లెమో అంతా మంచుకొండలూ, లోయలూ .... మన మిక్కడ ఒక రోజున చలిగా ఉంటేనే, సుతారంగా ఇళ్లలోనే మనుగులు పెట్టుకుని పడుకుండి పోతాం కదా. అక్కడ మన సైనికులు ఎన్ని కష్టాలు పడుతూ, యుద్ధం చేస్తున్నారో .. '' అన్నాడు.

ఆ మాటలు చెప్పి ఆయన వెళ్లిపోయాడు. సింగన్న మళ్లీ కూలబడ్డాడు. అతని మనసు కలవర పడింది. ఎందుకో చికాగ్గా ఉంది. బొడ్లో పొగాకుకాడకోసం వెదికితే ఒక చిన్న ముక్క దొరికింది. దానితోపాటు డాక్టరిచ్చిన సూదిమందు చీటీ కూడా బయటికి వచ్చింది. సింగన్న ఆ చీటీని అరిచేతిలో ఉంచుకుని మడతలు సరిజేసి చూశాడు. అందులో వ్రాసిఉన్న దేమిటో అతనికి తెలియ లేదు. పొద్దుటినుంచి తిండి లేకపోవడంవల్ల అత... ...న్లు తిరుగుతున్నాయి. ఆ చీటీని మడిచి మళ్లీ బొడ్లో ఉంచుకుని, ఆ చిన్న పొగాకు కాడని నమలటం ప్రారంభించాడు. సూర్యరశ్మి బంగార —రంగులో ఉంది. రోడ్డుమీద నడు స్తున్న జనం—నీడలు పొడుగవుతున్నాయి. ఎవరో యిద్దరు మనుషులు అతని ముందునుంచే యుద్ధ విషయాలు మాట్లాడుకుంటూ వెడు తున్నారు.

సింగన్న కళ్లకు మూడు రూపాయి—నోట్లు కనిపిస్తున్నాయి; మూడు రూపాయి—బిళ్లలూ కనిపిస్తున్నాయి. ఆ నోట్లు అతని కళ్లముందే సీతా కోక—చిలుకల్లా తిరుగుతూ అతనికి అందకుండా ఉన్నాయి. ఆ రూపాయి—బిళ్లలు అతనిముందే గిరగిరా తిరుగుతూ ఊరిస్తున్నాయి. అతని కళ్లకు కొద్ది గజాల దూరంలో త్వరత్వరగా నడిచి వస్తున్న ఒక నడి—వయసు మనిషి కనిపించాడు.

ఆయన సింగన్నకు దగ్గరగా వచ్చి, పరకా యించి చూసి, "నీవు పామును పట్టగలవు కదూ ? నిన్ను పొద్దున చూశాను నేను. మా యింట్లో అరగంట సేపటినుంచీ హడానిడి పడు తున్నాము. నా వెంట రా ... '' అన్నాడు.

సింగన్న గబగబా బుట్టలు నెత్తి కెత్తుకున్నాడు. అడుగు ముందుక వేసి, తూలి -పడబోయి తమాయించుకున్నాడు. తర్వాత ఆయన—వెంట తేలిపోతున్న కాళ్లతో నడిచిపోయాడు.

అదొక పెంకుటిల్లు. ఇంటిముందు విశాలమైన ఆవరణ ఉంది. అందులో రకరకాల మొక్క లున్నాయి. ప్రహరీగోడ పక్కనే ఒకవైపున పాత పెంకులు పేర్చబడి ఉన్నాయి. ఇంట్లో ఆడవాళ్లూ, ఒక పన్నెండేళ్ల కుర్రవాడూ అక్కడ నిలబడి చూస్తున్నారు. ఆయన అటు చూపించి, 'అదుగో ఆ పెంకుల మధ్య కనిపించింది... బయటికి రాలేదు.... '' అన్నాడు ఆదుర్దాగా .... ఒకావె "పామును మనం చంపకూడదు .... పట్టించెయ్య డమే మంచిది... పిల్లలు తిరుగుతూఉండే యిల్లు" అన్నది. తర్వాత తాము ఇంతకుపూర్వం పాముల చంపడంవల్ల వచ్చిన అనర్థాలు చెప్పుకు పోతున్నది.

సింగన్న బుట్ట లొక పక్కన పెట్టుకుని బొడ్లోనుంచి ఒక వేరుముక్క చేతిలోకి తీసుకుని పచ్చికలో నడిచి ముందుకు వెళ్లాడు. తర్వాత పెంకులను చేత్తో కదపటం ప్రారంభించాడు. ఇంతలో మెరుపువలె బారెడు పొడుగున్న ఒక నల్ల త్రాచు పెంకులలోనుంచి బయటపడి జరజర పాకుతూ మరొకవైపుకు వెళ్లింది. సింగన్న దాని వెంట పడ్డాడు. చేతిలో వేరు ముక్కతో అటడూ, జరజరా పాకుతూ ఆ త్రాచుపామూ ఆవరణ అంతా పరుగు—పందాలు వేసుకున్నట్టు రెండు నిముషాల సేపు కలయ తిరిగారు. సింగన్నకు ఒళ్లంతా చెమటలు పట్టింది. ఆ పాము అతన్ని చాలా యిబ్బంది—పెడుతున్నది.

చివరకు బావి—మూల నుంచి పాము—తలను చేత్తో పట్టుకుని సింగన్న చెమటలు—కక్కుతూ యివతలికి వచ్చాడు. అక్కడ పంచలో చేరిన చిన్నా పెద్దా అందరూ విస్తుపోయారు. ఒకావె గుండెలమీద చెయ్యి వేసుకున్నది. ఆ కుర్రవాడు 'అబ్బ!' "నా అంత పొడుగున్నది .... '' అన్నాడు.

సింగన్న ఆ పామును రెండో బుట్టలో ఉంచి మూతవేసి పక్కనే కూర్చుని చెమట తుడుచు కున్నాడు. ఆ యింటి యజమాని 'అమ్మయ్య' అనుకుని లోపలికి వెళ్లి చేతిలో అయిదు—రూపా యల నోటుతో యివతలికి వచ్చి సింగన్నకు ఇస్తూ, "యిది తీసుకో .... '' అన్నాడు.

సింగన్న వినయంగా రెండు చేతులతోనూ దాన్ని అందుకుని కళ్ల కద్దుకుని బొడ్లో భద్రంగా దాచుకున్నాడు. తర్వాత ఒక వేరు తీసి, ఆయన కిస్తూ, "ఇది ఉంచండి బాబయ్యా ! దివ్యమైన వస్తువు .... '' అన్నాడు.

తర్వాత ఒక్క క్షణం ఆగి, "పట్టెడన్నం పెట్టించు తల్లీ ! ఇయ్యాలంతా తిండి నేదు. కళ్లు తిరుగుతా ఉన్నాయి" అన్నాడు. అతని గొంతు నీరసంగా ధ్వనించింది.

ఆమె "అయ్యో! దానికేం నాయనా ? అలాగే సమయానికి దేవుళ్లా వచ్చావు. అలా కూర్చో..." అంటూ, లోపలికి వెళ్లి రెండు నిముషాలలో అన్నంతో నిండిన విస్తరి తెచ్చి అతని ముందు ఉంచింది.

సింగన్న నీళ్లు నిండిన కళ్లతో ఆమెవంక ఒకసారి చూసి, అన్నం కలుపుకుని కళ్ల కద్దుకుని తినటం ప్రారంభించాడు. అక్కడ చేరినవారు పాములను గురించిన తమ అనుభవాలను చెప్పు కుంటున్నారు.

* * *

తర్వాత అతడు ఆ యింటి యజమానికి దణ్ణం పెట్టి, పాముల—బుట్టలు నెత్తి కెత్తుకుని యివత లికి వచ్చాడు. పొద్దు వాలింది. ఎక్కడో సైరన్ కూస్తున్నది. పొద్దుగూకి, చీకటి పడిన తర్వాత గాని, తన ఊరికి పొయ్యే రైలు లేదు. "ఈ లోపల సూదిమందు కొనుక్కుని పేటను కెళ్లాలి" అనుకున్నా డతడు.

పెద్ద బజార్లోకి రాగానే ముందుకు నడవటం కష్టమయింది. పెద్ద ఊరేగింపు ఒకటి ముం దుకు కదిలివస్తున్నది.... జెండాలు గాలిలో రెపరెప లాడుతున్నాయి.. లౌడ్స్పీకర్లలోనుంచి 'స్వతంత్ర భారత్ జిందాబాద్,' 'పండిట్ నెహ్రూ జిందా బాద్', 'చైనా దురాక్రమణ నశించాలి' అని మిన్ను ముట్టేలా కేకలు వినబడుతున్నాయి.

ఊరేగింపు చౌకులో ఆగింది. ఒకాయన బండిమీద ఎక్కి, లౌడ్స్పీకర్లో ఉద్రేకంగా ఉపన్యాసం యిచ్చాడు. సింగన్న శ్రద్ధగా విన్నాడు. అతనికి చాలా భాగం అర్థమయింది. చివరకు ఆ ఉపన్యాసకుడు "మన సరిహద్దులో బలవంతుడైన శత్రువుతో మంచులో, చలిలో, కొండలోయల్లో ధైర్య సాహసా లతో, దేశ రక్షణకోసం పోరాడుతున్న మన సైనికుల కోసం విరాళాలివ్వండి.... వారు దేశ రక్షణ కోసం తమ ప్రాణాలనే త్యాగం చేస్తున్నారు. వారి ప్రాణ రక్షణకోసం మనం కొన్ని చిన్నచిన్న సుఖాలు త్యాగం చెయ్యాలి...." అంటూ ముగించాడు.

మళ్లీ చెవులు బద్దలయేలా కేకలు ప్రారంభ మైనాయి. అందరూ ఉద్రేకంతో ఊగిపోతున్నారు. జనంలో ఒకరిద్దరు వెళ్లి బండిమీద నిలబడి ఉపన్యాసం యిచ్చిన వ్యక్తికి తమ ఉంగరాలు, గడియారాలు యిచ్చివేశారు. సీళ్లు వేయబడిన పెద్దపెద్ద డబ్బాలు చేతుల్లో ఉంచుకుని వలం టీర్లు జనంలో తిరగటం ప్రారంభించారు. వారికి ఊపిరి సలపటంలేదు. జనం నాణేములూ, నోట్లూ ఆ డబ్బాలలో వెయ్యడంకోసం ఎగబడుతున్నారు.

సింగన్న కళ్లు పెద్దవి చేసుకుని అంతా చూస్తు న్నాడు. అతనికి యుద్ధంలో చచ్చిపోయిన తన అన్న జ్ఞాపకం వచ్చాడు. ఆ పరిసరాలలోకి వచ్చిన ఒక వలంటీరు వైపుకు జనం చేతులలో నాణేములతో నోట్లతో ఎగబడ్డారు.

కొంచెం రద్దీ తగ్గగానే ఆ వలంటీరు బరు వైన డబ్బాను అతికష్టంమీద మోసుకుంటూ అక్కడికి వచ్చాడు.




"బాబూ! నీగితం అంతా ఉత్త చీకటి మయంగా వుంది...."

# భ్రష్టయోగి

సింగన్న—పక్కన నిలబడిఉన్న ఒక పదిహేనేళ్ళ అమ్మాయి చేతులకున్న గాజులూ, మెడలోఉన్న చంద్రహారమూ, గొలుసూ తీసి యిచ్చేస్తున్నది. సింగన్న నివ్వెరపోయాడు. అతని కళ్లు చెదిరి పోయాయి. "అమ్మ బాబో! ఈ పిల్లకెంత ధైర్యం" అనుకున్నాడు.

వలంటీరు తనవైపు కదిలివస్తున్నాడు. తనేమైనా యివ్వాలి.. సింగన్న బొడ్లో వెదికాడు.. చేతికి అయిదు—రూపాయల నోటు తగిలింది. క్షణంలో సగంలో అతని కళ్లముందు గంగీ, సూది మందూ, డాక్టరూ గిరగిరా తిరిగిపోయారు. మిగిలిన సగంలో తన కళ్లముందు ఒకటే దృశ్యం నిలిచిపోయింది..... భయంకరమైన మంచు కొండలలో, లోయలలో, ఎముకలు కొరుకుతూ, పళ్లు పటపటలాడించే ప్రాణాంతకమైన చలిలో, మర ఫిరంగులతో, తుపాకులతో, ప్రాణాలకు తెగించి బలవంతుడైన శత్రువును నిలవరిస్తున్న వీర యోధులు తప్ప అతని కప్పుడు మరేమీ కనిపించ లేదు. అవును; వాళ్లు తనకోసమూ, తనవంటి ఈ జనంకోసమే అంత త్యాగాలు చేస్తున్నారు. తమకోసమే భార్యా పిల్లలనూ, తల్లిదండ్రులనూ సోమరి సుఖాలనూ లెక్కచేయక దేశ రక్షణకోసం ప్రాణాలను తృణప్రాయంగా అప్పగిస్తున్నారు. వారిలో ప్రతిఒక్కడూ తన అన్నవంటివాడే... వారిలో ఒక్కడుకూడా చలితో బాధపడకూడదు. వారిలో ఒక్కడుకూడా చేతిలో ఆయుధాలులేక నిస్సహాయంగా మరణించకూడదు.

సింగన్న పరిసరాలను గుర్తించే స్థితికి వచ్చే సరికి, అతని చేతిలో అయిదు—రూపాయల నోటు లేదు; అది వలంటీరు చేతిలోఉన్న డబ్బాలోకి చేరిపోయింది. అక్కడ ఉన్న నలుగురైదుగురు మనుషులు ఆతనివంక సాదరంగా చూస్తున్నారు.

ఊరేగింపు మళ్లీ మిన్నుముట్టే కేకలతో ముందుకు కదలి వెళ్లిపోయింది. అక్కడి జనం కొద్ది నిముషాలలోనే పలచబడ్డారు.

సింగన్న నెత్తిన పాముల—బుట్టలతో నడవటం ప్రారంభించాడు. బండి వచ్చేవేళయింది. అతని మనసులో యిప్పుడే ఆలోచనలూ లేవు.. ఎందుకో ఆనందంగా ఉంది .... అయినా ఒకమూల ఒళ్లెరగని జ్వరంతో పడిఉన్న గంగి—రూపం మాత్రం కనిపిస్తూనే ఉంది.

బజారులో మందుల షాపు ఒకటి కనబడింది. విద్యుద్దీపాల వెలుగులో రకరకాల మందులు అందమైన బీరువాల్లో పేర్చబడిఉన్నాయి. సింగన్న ఆ షాపుముందు ఒక్కక్షణం నిలబడి కన్నార్పకుండా చూశాడు. తర్వాత నిట్టూర్చి, మళ్లీ నడక సాగించాడు. స్టేషనులో బండి బయలు దేరేందుకు సిద్ధంగాఉంది.. టిక్కెట్టు కొనకుండా (పైసాకూడా లేదుగా మరి!) అతడు నేరుగా వెళ్లి, కదలబోతున్న రైలునెక్కి ఒక పెట్టెలో క్రింద కూర్చున్నాడు. రైలుపెట్టెలో కూడా అందరూ ఆ సాయంకాలం వచ్చిన వార్తాపత్రికలు చదువుతూ యుద్ధాన్ని గురించే మాట్లాడు తున్నారు.

సింగన్న దిగవలసినది పక్కస్టేషనులోనే. అతడు రైలు పరుగెత్తుతూ ఉండగా గంగిని గురించే ఆలోచిస్తూ కూర్చున్నాడు. జరిగిందేదో జరిగిపోయింది. భగవంతుడి దయవల్ల తానింటికి వెళ్లగానే గంగికి జ్వరం తగ్గిపోయిఉంటే "ఏడు కొండల స్వామీ, ఎంకటేశ్వరులూ! శనివారంనాడు పొద్దుటేల నీకు టెంకాయ కొడతాను" అనుకున్నాడు.

అతనిలో ఈ ఆశాపాశం బాగా ధైర్యం కలిగించింది. మొండిధైర్యంతో రైలు దిగి, తన పాకవైపు నడిచాడు. కొద్ది గజాల దూరంలోనే తన పాకముందతనికి యిద్దరు ముగ్గురు మనుషులు కనిపించారు. అతని గుండెలు ఝల్లుమన్నాయి. నెత్తిమీద రోజూ మోసే పాముల — బుట్టలే అయినప్పటికీ కొండలంత బరువున్నాయి. అతడు ఒణుకుతున్న కాళ్లతో ముందుకు నడిచాడు.

పాకలోనుంచి వైద్యుడు యివతలికి వస్తూ ఎదురువచ్చిన సింగన్నను చూసి, "భలేవాడివిరా నువ్వు! మందుకని వెళ్లి మాసికానికి తిరిగివచ్చే రకం. నిన్ను నమ్ముకుంటే యింతేనన్నమాట. ఇంజక్షన్లు తెస్తానని వెళ్లి యిప్పుడా రావటం?" అన్నాడు.

సింగన్న దణ్ణంపెట్టి బుట్టలు దింపుకుని ఆదుర్దాగా, "ఎట్టా ఉంది బాబూ!" అని అడిగాడు. ఆయన వెళ్లిపోతూ, "లోపలికి వెళ్లి చూడు" అన్నాడు.

పక్కయింటి ముసలమ్మ చిన్న దీపపు బుడ్డితో ముందు నడుస్తూ ఉండగా ఒణుకుతున్న కాళ్లతో సింగన్న, గంగి పడుకున్న మంచం దగ్గరికి వెళ్లి చూశాడు.

గంగి, అడుగుల చప్పుడు విని, ఇటువైపు తిరిగి నీరసంగా కళ్లు తెరిచి చూసింది. సింగన్నను కూర్చోమని సైగచేసి, "ఏటలా సిక్కిపోనావు? ఈ నాల్రోజులూ తిన్నావా లేదా పిచ్చోడినాగున్నావు ...." అన్నది.

సింగన్న — చేతికి ఆమె చెంపలూ, నుదురూ చల్లగా తగిలాయి. "జొరం తగ్గిపోనాదా?" అని అడిగాడు.

ముసలమ్మ: "తగ్గిపోక కూకుంటదేటి? మామూలు జొరమే గదంటరా? నూకలొండి పెట్టినాను. ఇగ నువ్వు లెగసి నాలుగు మెతుకు లెంగిలిపడు, సింగడూ" అన్నది.

సింగన్నకు ఆకలి లేదు. సాయంకాలం పాముని పట్టగానే, అన్నం పెట్టిన ఆ యిల్లాలి ముఖం జ్ఞప్తికి వచ్చింది. 'అన్నపూర్ణమ్మలా గుంది తల్లి. కడుపునిండా అన్నం పెట్టినాది....నా గంగికేమో జొరం తగ్గిపోనాది. సంపాయించిన అయిదు రూపాయిలూ నా అన్నల్లాంటి సైనికుల కోసం యిచ్చేసొచ్చినాను. ఇక నాకు ఆకలేటి కవుతాది" అనుకున్నాడతడు. ముసలమ్మ దీపం అక్కడ ఉంచి, వెళ్లిపోయింది.

పూరిపాక — కప్పులో ఉన్న రంధ్రంలోనుంచి చల్లని వెన్నెల కిరణాలు నాలుగు వచ్చి, గంగి చెంపలమీద పడుతున్నాయి. సింగన్న, చిక్కిపోయిన గంగి — చెంపలు నిమురుతూ తృప్తిగా అలాగే కూర్చుండిపోయాడు. 

# రాజధాని కబుర్లు

9-వ పేజీ తరువాయి

ఉండటమే కాదు; విశాల హైదరాబాదు ప్రజలకు, ఆయనతో సన్నిహిత సంబంధం ఉంది. రాష్ట్రపతిగా, బొలారంలో రాష్ట్రపతి నిలయానికి వచ్చేసి, యిక్కడి ప్రజలతోనూ సంస్థలతోనూ పరిచయమయ్యాడు. ఉన్న పది రోజుల్లోనూ కూడా, కార్యక్రమాల తోరణాల్లోనే నలిబిలయిపోయాడు. ఈ రాష్ట్రంమీద, ఈ నగరంమీద, ఆయనకు ప్రత్యేక శ్రద్ధలున్నాయేమో అనే భావన ప్రజల్లో కల్గించాడు. ఇంకా యెక్కువ సన్నిహితుడు కావలసిందే! కాని ఆయన అనారోగ్యం అడ్డంగా నిలిచిపోయింది. రెండు—మూడు సార్లు, ఏదో రూపంగా హైదరాబాదు రావలసినవాడు, అనారోగ్య కారణంగా మానుకోవలసివచ్చింది. ఇది చాలా నిరుత్సాహం కలిగించినమాట నిజమే! అసలు నిజానికి ఆయన అనారోగ్యం అప్పుడప్పుడు, ఆయన కార్యదీక్షను, సేవాధర్మాన్ని పరీక్షిస్తూనే వచ్చింది. అయితే దాన్ని అధిగమించి, మనోనిబ్బరంతో, నిర్వహించుకుంటూనే వచ్చాడు. దేశం మొత్తంమీద హైదరాబాదు నగరమే ఆయనకు కొంత వరకైనా ఆరోగ్యాన్నిచ్చిందని చెప్పచ్చు. ఇక్కడి వాతావరణం, శీతోష్ణస్థితి ఆయన శరీరానికి సరిపోయినాయి. అందువలనే క్రిందటి సంవత్సరం, సతీసమేతంగా యిక్కడికే వచ్చి ఉన్నాడు. డాక్టర్ రాజేంద్రప్రసాద్‌గా కాదు; రాజెన్ బాబుగా వచ్చాడు. లేక్‌వ్యూ గెస్ట్‌హౌస్‌లో మకాం చేసినప్పుడు, ప్రజలకు యింకా యెక్కువగా సన్నిహితంగా రాగలిగాడు.

ఆనాడు సాయంత్రం నాలుగు గంటలు కావస్తోంది. ఆయన్ను చూద్దామని వెళ్లాం. సోఫాలో పద్మాసనుడై కూర్చున్నాడు. తలమీద టోపీ లేదు. నమస్కారం స్వీకరిస్తూ, ఆయన చేతులు జోడించాడు. వెళ్లి, ప్రక్కనే కూర్చున్నాం. ఆయనతో మాట్లాడిన పది—నిముషాల్లోనూ, మహాత్మాజీ అంటూ, గాంధీజీ—విషయాన్ని, ఆయన అభిప్రాయాన్ని, ఎన్నిసార్లు ముచ్చటించారో లెక్క లేదు. ఆరోగ్యం మెరుగ్గానే ఉంది. ఇక్కడే ఇంకా కొన్నాళ్లుంటే, యింకా బాగా కుదటబడుతుందనే నమ్మకం కలుగుతోంది అన్నారు. ఎంతో ఆప్తుల్ని పలకరించినట్లు, మమ్మల్ని గురించిన విషయాన్ని ఆసక్తితో అడిగారు. నాతో వచ్చిన స్నేహితుడు, ఈ దేశ పరిస్థితులను ప్రస్తావిస్తూ, నిరుత్సాహాన్ని వెలిబుచ్చాడు. దానికి వెంటనే ఆయన సమాధానం యిచ్చారు: దేశంలో నైతికస్థాయి, యింకా బాగా పెరగాలి; అప్పుడు ఈ సమస్యలన్నీ, వాటంతటవే పరిష్కార మవుతాయని. అన్నింటికి మూలకారణమైన నైతిక విలువలను గురించి ఎంత చక్కగా చెప్పారు అనుకున్నాం. ఇతరులను నిందించటంకంటె, లోపించిన విషయాన్ని కొట్టచ్చినట్లు చెప్పారు. నిందారహితంగానూ, ప్రబోధంగానూ, నిర్మాణాత్మకంగానూ, ఆయన ప్రవచనాలు ఉండబట్టే, అందరికీ గౌరవపాత్రుడయ్యాడు. గొప్పతనాన్ని, సాధించాలనే ఉద్దేశంతో కృషిచేసినవాడవుతేకాదు; అయితే యేం, తన కృషిచేత గొప్పతనాన్ని సాధించగలిగాడుగా! 



విల్స్

# సిజర్సు

కాలుస్తుంటే ఎంత హాయిగా
ఉంటుంది!



# న్యూఢిల్లీ లేఖ

7—పేజీ తరువాయి

**మహావీరత్యాగి వ్యవసాయ విషయి కాలపైన పన్ను విధింపు అసహజమైందనీ, ప్రభుత్వంయొక్క ఆలోచన లేమని విమర్శించారు. కారణమేమంటే వ్యవసాయోత్పత్తులపైన పన్ను విధించటమనేదే విడ్డూరం. పైగా నిర్బంధమైన పొదుపు ఉద్యమం అనేది ఇంకోరకమైన పన్నన్నమాట. ఇందువల్ల ఆసామి అప్పులో మునుగుతాడు. తన పొలం ఆదాయంకు సుమారు 1¼ రెట్లు ధనం చెల్లించాల్సి వుంటుంది.**

శ్రీ గుల్జారీలాల్‌నంద వేసిన ధరల అదుపు అంతా కాగితంలోతప్ప వేరే ఎక్కడా కనబడదని మాజీ ఆహారశాఖమంత్రి శ్రీ ఎ.పి. జైన్ స్పష్టంగా చెప్పటం జరిగింది. ఇప్పటికే ధరలు విపరీతంగా పెరిగిపోయాయి. జీతాలకు అందనంతై పోయాయి ఇప్పుడు న్యూఢిల్లీలో బతకాలనుకున్నవాడెవడైనా సరే, విద్యుత్తు, టీ, రవాణా సదుపాయాల. ఒకటేమిటి అన్నిటికీ ముడుపు చెల్లించుకోవాల్సిందే.

రోజురోజుకు పెరుగుతున్న జీవన వ్యయంలో మామూలు చిన్న మొత్తాల పొదుపునే చేసుకోలేని ఓ వ్యక్తి నిర్బంధపు పొదుపు ఎలా చెయ్యగలడో, శ్రీ దేశాయి చెప్పలేకపోయారు. మరి జాతీయ ఆదాయంలో ఎక్కువభాగాన్ని ప్రణాళికాసంఘం పుచ్చుకుంటూంది !

**జీవనప్రమాణాలు రోజురోజుకు పెరుగుతున్నాయంటున్నది ప్రభుత్వం ఆమాట మాత్రం నిజం. అందులో అనుమానం ఏంలేదు! 1947 నాటి తిండికీ ఈనాడు ప్రజల ఆహారానికి ఎంతో భేదం కన్పిస్తుంది. కానీ రోజురోజుకూ పెరిగిపోతున్న కొత్త పన్నులు, నిర్బంధపొదుపులో వారి జీవనప్రమాణాలు పాడైపోతున్నవి.**

ప్రస్తుత పరిస్థితులనుబట్టి ఆర్థికమంత్రి ప్రవేశపెట్టిన బిల్లులన్నిటికి ఆమోదంవచ్చే సూచనలు తక్కువ. నిర్బంధపొదుపు, అదనపు అధిక లాభాలపై పన్నులను కొద్దిగా సవరించాల్సి వుంటుంది.

*　　*　　*

ఫ్రెంచి—రాజకీయవేత్త, ఆర్థికశాస్త్రవేత్త బెర్ట్రండ్ డి. జోవినల్' 'కౌన్సిల్ ఫర్‌ది ఫ్యూచర్' తరఫున మన దేశానికి ఇటీవల వచ్చారు.

ఆయన రాకకు ముఖ్యోద్దేశ్యం : భారత దేశంలోని మేధావంతులమ్ము పశ్చిమ యూరోపులోని ఒకానొక మేధస్తత్వ కార్యక్రమంలో తోడ్పడవలసిందిగా కోరటమే.

ఈ కార్యక్రమం జరిగే పద్ధతిలో ప్రాథమిక సూత్రం చాలా సులువైందే. జన సంక్షేమంపట్ల కాస్తోకూస్తో ఆలోచనాశక్తి ఉన్న ప్రతివ్యక్తి, భవిష్యత్‌లో జరగబోయే పరిణామాల గురించి ఆలోచిస్తాడు. భవిష్యత్ పరీక్ష సంగతి ఎలా ఉన్నా, ఎవరి సహాయంలేకుండా ఎవరికివారు ఎలాంటి ప్రయత్నంచేసినా, అది దారుణంగా విఫలమవుతుంది. ఈ ప్రయత్నమే పరస్పర సహకారంతో చేస్తే ఫలవంతమవుతుందనేది వేరే చెప్ప నవసరంలేదు. అర్థికమైన పరిణామాలను గురించి వ్యక్తిగత జోస్యంనుంచి ఓ క్రమపద్ధతి అంచనాకు వచ్చింది ముప్ఫై సంవత్సరాల నుంచి మాత్రమే. అలాగే రాజకీయ, సాంఘిక భవితవ్యాలను గూర్చి ఓ క్రమపద్ధతి—జోస్యానికి అలవాటు చేయాలనేదే ఈ భవిష్యత్ జోస్య మండలి ఉద్దేశ్యం.

ఈ పనికిగాను ఈ సంస్థ వివిధ రంగాలలోని వేత్తలను వారి కిచ్చిన విషయాలపై అంచనాలు వేయమంటుంది. ఈ వివరాలను సేకరించి పాటివేత్తలు మరికొందరు చర్చించటం జరుగుతుంది. ఇలా చెదురుగా వచ్చిన అంచనాల: ఎంతవరకు ఏకీభవిస్తున్నవో పరిశోధన జరుపుతారు. ఇప్పటికే సుమారు ఏభైకి పైగా ఫ్రెంచి భాషలో, ఇంగ్లీషులో 12 ప్రచురించటం జరిగింది. ఈ పద్ధతి పైన ప్రప్రథమ సమావేశం 1962 జూన్‌లో "జెనీవా గ్రాడ్యుయేట్ స్కూల్ ఆఫ్ ఇంటర్నేషనల్ స్టడీస్"లో జరిగింది.

పశ్చిమ యూరప్‌లో పుట్టిన ఈ ఉత్సాహం, సాంఘిక, అంతర్జాతీయ విషయాలపైన చక్కని పరిశోధనలకు దోహదం చేసింది. భారతీయ మేధావంతులు కూడా ఈ కార్యక్రమంపట్ల మొగ్గు చూపే అవకాశాలున్నాయని, పరిశోధనా ఫలితాలు నిరూపిస్తున్నాయి.

ఫోర్డ్—సంస్థ ఆర్థిక సహాయంతో నడిచే ఈ సంస్థలో శ్రీయుతులు ఎమిలె మిరిహాజ్ పర్పెట్యుయల్ సెక్రటరీ ఆఫ్ అకాడమె డెస్. సైన్సెస్ మోరలె), ప్రొఫెసర్. యం. యం. పోస్టన్ (కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయంలో ఆర్థిక చరిత్ర అధ్యాపకుడు), ప్రొఫెసర్ యూజెనీ రాస్టోవ్ యేల్— లా స్కూల్ డీన్), ప్రొఫెసర్ జాక్విస్ ఫ్రేమాన్‌డ్ (గ్రాడ్యుయేట్ ఇన్స్టిట్యూట్ ఆఫ్ ఇంటర్నేషనల్ స్టడీస్ డైరక్టరు—జెనీవా వాల్డిమర్ నీల్‌సన్ (ఆఫ్రికన్, అమెరికన్ సంస్థ డైరెక్టరు), బెర్ట్రండ్ జూవొనెల్ ఉన్నారు. ప్రొఫెసర్ డేనియల్ బెల్‌కూడా ఈ కార్యక్రమంలో పనిచేస్తున్నారు.

ఇటీవల మనదేశానికి వచ్చిన శ్రీ బెర్ట్రండ్ జూవొనెల్, పారిస్‌లోని ఓ ఆర్థిక సంబంధమైన పత్రికకు సంపాదకుడు. ఇంకా చాలా సంఘాలలో ఆయన సభ్యులు. 1961లో పూనాలో 'ఆర్థికాభ్యున్నతికి మార్గాలు' అనే విషయంపై జరిగిన కాంగ్రెస్ చర్చా సదస్సులో ప్రొఫెసర్ గాడ్గిల్‌తో కలిసి పాల్గొన్నారు. ఆయన రాజకీయ సిద్ధాంతాలపైన, చాలా గ్రంథాలు వ్రాశారు: అధికారము, సార్వభౌమత్వం (ముద్రణలో ఉన్నవి,) రాజకీయ శుద్ధ సిద్ధాంతాలు అనే గ్రంథాలు ఇంగ్లీషులో ఉన్నాయి కూడా. ★

# అవీ - ఇవీ - అన్నీ

## అనుపమావారి చిత్రం

తెలుగు సినిమాల్లో ఈ మధ్య కథలకి వెరైటీ లేదా అనకుండా, ఓ 'కథ'ను ఇవ్వాలనే ప్రయత్నంగా ఉండాలిందీ అంటూన్న అనుపమావారి "ఈడూ జోడూ" చిత్రం చాలావరకు పూర్తి అయింది. ఒక డాన్సు—దృశ్యం చిత్రీకరించాలట. ఈ చిత్రంలో కొత్త అమ్మాయి మణిమాల పరిచయం కాబోతున్నది. జమున, జగ్గయ్య, చలం ముఖ్యులు వారు నటిస్తున్నారు. ఆరుద్ర పాటలు, సినీసెట్టి



వోల్గా నం. 1 లో అంజలీదేవి.

మాటలూ రాస్తున్నారు, పెండ్యాల సంగీతం కూరుస్తున్నారు దీని సారథి ...ఆక్

## భానుమతితో చిత్రం

భానుమతి, గుమ్మడి నటిస్తున్న అనురాగ వారి చిత్రం ప్రస్తుతం వాసంతి, హరనాథ్, గిరిజ, చలం; అనే రెండు జంటలతో ఔట్‌డోర్ దృశ్యాల తీస్తున్నారని తెలుస్తోంది. ఈ చిత్రంలో జి. వరలక్ష్మి, జానకి కూడా ఉన్నారు.

## హిందీ చిత్రాలు

హిందీ—చిత్రాల వార్తలు చూస్తే 'గృహస్తి' బొంబాయిలో రిలీజైంది. ఇందులో అశోక్ కుమార్, నిరూపారాయ్‌లు ప్రధాన భూమికలు నిర్వహించారు. దీని నిర్మాత జెమినీవాసన్. దీని కథకుడు 'కథల' ఖాన్ మాఖీ రాం శర్మ. ఈ చిత్రంలో అసలు కథకన్నా పిట్టకథలు జాస్తీ అని బొంబాయివార్త. పాటలు పర్వాలేదని 'రవి' కూర్చిన కొన్ని బాణీలైన కర్ణపేయంగా ఉన్నాయని పత్రికలంటున్నాయి.

## ఆకాశదీపం

తొలిసారిగా ధర్మేంద్ర నందాలు ప్రణయ జంటగా ఫణీమజుందార్ తీస్తున్న చిత్రంలో అగుపించనున్నారు. తొలి సెట్‌మీద పని పూర్తి అయింది. అవగానే, యిద్దరూ సంతృప్తికరంగా ఉన్నదనే భావాన్ని ప్రకటించారు. ఈ చిత్రానికి సంగీతం చిత్రగుప్త ఇస్తున్నాడు.

ఈ హిందీ-చిత్రవార్తలు రాస్తూండగా, ఆంధ్రా ఫిలిమ్ - పరిశ్రమవాళ్ళు ఏర్పాటుచేసుకున్న రక్షణ నిధి సంఘంవారి రెండో సమావేశం విశేషాలు తెలియవచ్చాయి.

సినీ కళాకారులంతా కలిసి, మూడు కేంద్రాలలో తెలుగు దేశాన వేర్వేరు బృందాలుగా ప్రదర్శనలు ఏర్పాటుచేయాలనుకున్నారు. ఈ ప్రదర్శనలు మే నెలలో మూడో వారంలో ఉంటాయి. సావిత్రి, నాగేశ్వరరావు, ఎస్. వి. రంగారావు, సూర్యకాంతం మొదలగువారు మంచిమనసులు లోనించి ఓ సీను వేసి, తద్వారా రక్షణనిధికి విరాళం తీసుకూరుస్తారు. మరోబృందంగా జమున, కన్నాంబ, రంగారావులు 'దేశంకోసం' అనే ప్రదర్శన యిస్తారు. అలాగే రక్తసంబంధంలోనించి ఓ సీను, కాంతారావు, సావిత్రి నటించి చూపిస్తారు.

లింగమూర్తి ఒక నాటికను తయారు చేస్తే రవి, మరోదాన్ని జగ్గయ్య, గుమ్మడి చేస్తారని తెలుస్తోంది. వీటికి ఆధ్వర్యం వహించేది ఎస్. టి. రామారావు. ఈ సంఘం కన్వీనరు పి. పుల్లయ్య.

## 'వాల్మీకి' నవల

వెండితెరనవల సినిమాలోనో కాస్త ముందు గానో, విడుదలవడం పరిపాటే. వాల్మీకి చిత్రం



"ఎదురీత"లో రేలంగి.

తాలూకా వెండితెరనవల సహా కార్యాలయం చేరింది. దీనిని గూర్చిన జి. వి. జి. రచన చాలా సరళంగా సజావుగా సాగింది.

ప్రతులకు స్వతంత్ర పబ్లిషర్స్, గాంధీనగరం విజయవాడకు రాయాలి. సుమారు నూరు పుటలు. వెల : 75 న. పై.

## నటుడు నాగేశ్వరరావుకు విజయావారి సన్మానం

"రాష్ట్రపతి స్వర్ణపతాకాలు ఎప్పుడూ బెంగాలీ, హిందీ, మరాఠీ, చిత్రాలకే





"చదువుకున్న అమ్మాయిలు"లో పద్మనాభం, సరోజ.



నటుడు శ్రీ అక్కినేని నాగేశ్వరరావు 100 చిత్రాలలో నటించడం పూర్తయిన సందర్భంలో వారిపేరున మద్రాసు విశ్వవిద్యాలయంలో స్కాలర్‌షిప్ నిధికిగాను విజయా అధిపతులు రు 25 వేలకు చెక్ ముఖ్యమంత్రి శ్రీ కామరాజ్ కు బహూకరించారు. శ్రీ బెజవాడ గోపాలరెడ్డి అధ్యక్షత వహించారు.

వస్తున్నాయి. దక్షిణాది చిత్రాలకు రావడంలేదు. ఇందుకు కారణాలు నాకు వివరంగా తెలియవు. కథల్లో లోపమో, నిర్మాణ ప్రమాణాలు తక్కువగా వున్నవో, చిత్రపరిశ్రమవారే శ్రద్ధగా పరిశీలించుకోవాలి. పతకాలు నిర్ణయించే సంఘంవారికి భాషా, ప్రాంతీయాభిమానాలు లేవని మాత్రం నేను స్పష్టంగా చెప్పగలను,'' అని రేడియో సమాచార శాఖామంత్రి శ్రీ బెజవాడ గోపాలరెడ్డి యిటీవల విజయా గార్డెన్స్‌లో శ్రీ అక్కినేని నాగేశ్వరరావుకు విజయా అధిపతులు చేసిన సన్మానసభలో సూచించారు.

శ్రీ అక్కినేని 'గుండమ్మకథ' తమిళ చిత్రములో నటించడంతో 100 చిత్రాలు పూర్తి చేసుకున్న సందర్భంలో లోగడ ఆయన చేసిన వాగ్దానం ప్రకారం మద్రాసు విశ్వవిద్యాలయానికి రు 25 వేల విరాళాన్ని ఆయన తరఫున విజయా అధిపతి శ్రీ నాగిరెడ్డి శ్రీ గోపాలరెడ్డికి చెక్కురూపకంగా అందజేశారు. శ్రీ గోపాలరెడ్డి ఆచెక్కును మద్రాసు ముఖ్యమంత్రికిస్తూ విశ్వవిద్యాలయంవారికి సమర్పించవలసిందిగా కోరారు.

ప్రారంభంలో శ్రీమతి సుశీల ప్రార్థనచేశారు. అనంతరం శ్రీ నాగిరెడ్డి స్వాగతమిస్తూ ఇలాఅన్నారు.

"లలితకళలు, సంస్కృతి, సాహిత్యం పట్ల శ్రీ గోపాలరెడ్డి శ్రద్ధాసక్తులు సువిదితమే. చలనచిత్ర పరిశ్రమలో ఆయనను మేమంతా 'పెద్ద'గా పరిగణిస్తాం. వారు ముమ్ముందు ఈ పరిశ్రమ ఎదుట్నే గడ్డుకాలంలో అసరాగా వుంటారని మా ఆశ."

"మనకు ప్రియమయిన ముఖ్యమంత్రి శ్రీ కామరాజనాడారు అట్టే కబుర్లు చెప్పరు; కాని చేసేది ఎక్కువ. కోడంబాకం రైల్వేగేటువద్ద ఓవర్ బ్రిడ్జి నిర్మాణం జరుగబోతున్నదంటే అదంతా వారి చలవే. ఈ బ్రిడ్జివలన ఇటు ఫిలింపరిశ్రమకు, కోడంబాకం పౌరులకుకూడా ఎంతో మేలు కలుగుతుంది."

శ్రీ అక్కినేని నటజీవితం అత్యంత ప్రముఖమైనది. నూరుచిత్రాలలో నటించినా పాతబడినట్లు కనుపించలేదు. నిత్యనూతనంగా ఆకర్షిస్తుంటాడు. వారిపేరున రు. 25 వేల స్కాలర్‌షిప్‌నిధిని మద్రాసు విశ్వవిద్యాలయంలో ఏర్పాటు చేయగోరుతూ ఈ చెక్కును అందజేస్తున్నాము."

సభాధ్యక్షత వహించిన శ్రీ బెజవాడ గోపాలరెడ్డి ఇలా ప్రసంగించారు.

"నాగేశ్వరరావుగారు 60 చిత్రాలలో నటించడం పూర్తయిన సందర్భంలో జరిగిన ఉత్సవాలను చూసి ఆనందించాను. ఇప్పుడు మళ్ళీ ఈ అవకాశం కలిగినందుకు సంతోషిస్తున్నాను. వారు అందరికీ ఆదరణీయులు; విశ్వాస పాత్రులు. నిర్మాతకు సహకారమివ్వడం వారి లక్ష్యం. ఏమాత్రం ఇబ్బంది పెట్టకుండా నడుపుకొస్తున్నారు. ఇది వారి ప్రశంసనీయమైన గుణాలలో ఒకటి. అదిగాక అశ్లీలానికి, అసభ్య శృంగారానికి, తావివ్వని నటనను వారు ప్రదర్శిస్తున్నారు. హద్దులు మీరకపోవడం వారి గొప్పతనం."

"విద్యా విషయంలో శ్రీ నాగేశ్వరరావు సేవలు చెప్పదగినవి. ఉదా: గుడివాడ కళాశాల. అది వారి పేరున నడుస్తున్నది. ఆంధ్రదేశంలోని కళాశాలల్లో అదొకటి. ఇదివరలో ఆంధ్ర విశ్వవిద్యాలయానికి రు 25 వేలు విరాళమిచ్చి సిండికేటుకు [illegible] కాంప్రు సభ్యులైనారు. ఇప్పుడు మద్రాసు విశ్వవిద్యాలయానికి రు. 25 వేలు ఇస్తున్నారు. హైదరాబాదు [illegible]. గనుక ఉస్మానియాకు కూడా ఇస్తారు. అలాగే శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం సంగతికూడాను. అవేన్నాళ్ళు చూసుకుంటారు."

"ఇక మద్రాసులో తయారయిన చిత్రాల సంగతి ప్రస్తావిస్తాను. నిరుడు బొంబాయి, కలకత్తాలలోకంటె ఇక్కడే ఎక్కువ తయారైనాయి. చలనచిత్ర పరిశ్రమ ఈ ఏడాది స్వర్ణోత్సవం జరుపుకోవడం ఒక విశేషం. పరిశ్రమను ఇలా బలంగా నిలవగలిగిన వారందరినీ ప్రశంసించాలి. ఇక చిత్రాలలో లోపాలు అనేవికూడా వున్నాయి. పదేండ్ల నుంచి అవార్డులిస్తూ వుంటే మద్రాసులో తయారయిన చిత్రాలకు రాష్ట్రపతి స్వర్ణపతకం లభించడంలేదు. మరాఠీ, హిందీ, బెంగాలీ, చిత్రాలకే వస్తున్నాయి. దీని కారణాలు సినీ పరిశ్రమవారే అన్వేషించాలి. ఎక్కడో ఏదో లోపం వున్నదనిపిస్తుంది."

"కామరాజనాడారుగారు చాలా పలుకుబడి గల వారు. ప్రజాబలం ఇంతగా కలిగిన ముఖ్యమంత్రిలేరనే చెపుతాను. అమాటే ఒక బీహారు శాసనసభ్యుడు నాతో అన్నాడు. మొత్తం 15 రాష్ట్రాలలో ఇతర గొప్పబలం, అండదండలు, కలిగిన ముఖ్యమంత్రిలేరని చెపుతాను. వారు నిగర్వి. ఈ రు 25 వేల చెక్కును శ్రీ లక్ష్మణస్వామి ముదలియార్‌గారికి సమర్పించవలసిందిగా వారిని కోరుతున్నాను."

## వదంతులను వినకండి
## వదంతులను ప్రచారం చేయకండి

ముఖ్యమంత్రి శ్రీ కామరాజనాడారు మాటా డుతూ వ్ర... కం దక్షిణాది చిత్రాలకు ఎందుకు రాలేదో ఆలో చాల్సిందేనన్నారు. శ్రీ నాగేశ్వరరావు గుణగణా లను, నటనాప్రతిభను, ఔదార్యాన్ని, ప్రశంసించారు. శ్రీ గోపాలరెడ్డి అన్నట్లు ఉస్మానియాకు కూడా ఏదయినా ఇప్పారని తమ ఆశాభావం వ్యక్తంచేశారు.

శ్రీ ఎ. ఎల్. శ్రీనివాసన్ ప్రసంగిస్తూ దక్షిణాది చిత్రాలకు అన్యాయం జరుగుతోందన్నారు. పతకాలు నిర్ణయించే సంఘంలో ఉత్తరాదివారికి సంఖ్యాబలం కలదని చెప్పారు. భాష తెలియకపోవడంకూడా ఒక కారణంగా పేర్కొన్నారు.

# ఆవీ - ఇవీ - అన్నీ

ప్రముఖ దర్శకుడు-నిర్మాత శ్రీ పుల్లయ్య ప్రసంగిస్తూ నాగేశ్వరరావు బాల్యదశనుంచీ తమతో గల పరిచయాన్ని తెలిపారు. నటుడు శ్రీ జగ్గయ్య మాట్లాడుతూ చిత్రాల విడివిడే ప్రమాణంగా తీసుకుంటే స్వర్ణ పతకాలు, డాక్యుమెంటరీలకు వెళ్లాల్సిందేనన్నారు. ఇక్కడకృషిబాగానేజరుగుతున్నా కృషి పరిగణనకు రావడంలేదని గ్రహించాలని సూచించారు. శ్రీ శివాజీ గణేశన్ మాట్లాడుతూ నాగేశ్వరరావు కళాసేవను ప్రస్తుతించారు.

శ్రీనాగేశ్వరరావు ప్రసంగానంతరం శ్రీగోపాలరెడ్డి మళ్లీ ప్రసంగిస్తూ స్వర్ణపతక ప్రదానం విషయమై శ్రీ ఎ. యల్. శ్రీనివాసన్‌చేసిన విమర్శలపట్ల తమ బాధను వెల్లడించారు. నిర్ణయ సంఘంలో ఉత్తర — దక్షిణ విభేదాలు, భాషాతత్వాలు లేవని స్పష్టం చేశారు. అయినా పతకాల నిర్ణయానికి సంబంధించిన నిబంధనలు ఏవయినా సవరించాల్సిన అవసరం వున్నదేమో పరిశీలిస్తామని హామీ నిచ్చారు. దక్షిణాదికి ప్రాతినిధ్యం పెంచే విషయం కూడా ఆలోచిస్తామని తెలిపారు. ★

| | |
|---|---|
| రాగి | 98 |
| కంది | 95 |
| ఉప్పుడు, బియ్యం, మిల్లు | 98 |
| మిల్లు బియ్యం | 99 |
| బియ్యం దంచినవి | 100 విటమిన్ బి1 బి2 స్వల్ప పరిమాణాలలో అన్ని లవణములు |
| నగ్గు బియ్యం | 100 |
| స్కిమ్‌చేసిన పాలు | 101 |
| పొట్ల | 6 |
| చిల్లగడ్డ | 37 |
| టొమాటో | 8 |
| గోధుమపిండి | 100 |
| బొప్పాయిపండు | 11 కాని దీనిలో ఔన్సుకు 573 యూనిట్ల విటమిన్ 'ఎ' ఉన్నది. |
| కేరట్ | 13 దీనిలోనూ 550 నుంచి 1221 యూనిట్ల వరకూ విటమిన్ ఎ. ఇతర లవణము లన్నీ ఉన్నవి. |
| కాయ పగలి వెలికి వచ్చే గింజలు | 98 |

తెలుగువారి భోజనంలో అత్యధికభాగం బియ్యం వరిబియ్యంకంటె గోధుమలు చాలా ప్రశస్తమైనవనీ, దంపుడు బియ్యం, మహా ప్రశస్తమనీ, మరబియ్యం విషతుల్యమనీ భావించేవారు ఉన్నారు. అందువల్ల వాటిని రసాయన స్వరూపాన్ని పూర్తిగా వివరిస్తున్నాము :

## దంపుడు బియ్యం పచ్చివి :

| | | |
|---|---|---|
| ప్రోటీను. ఔన్సుకు | 2.4 | గ్రాములు |
| కొవ్వు | ·2 | " |
| పిండిపదార్థము | 22.2 | " |
| కేల్షియం | 3 | మిల్లి గ్రా. |
| ఫాస్వరం | 5 | " |
| ఇనుము | ·8 | " |
| విటమిన్ ఎ | 1 | యూనిట్ |
| విటమిన్ బి 1 | 17 | " |
| నికో[illegible] సిడ్ | 7 | మిల్లి. గ్రా. |
| విటమిన్ బి | 34 | మిల్లి. గ్రా. |
| విటమిన్ సి. | శూన్యం | |
| [illegible] | [illegible] | |

# మనము-మన దేహస్థితి

11-వ పేజీతరువాయి

## మిల్లు బియ్యం పచ్చివి:

| | | |
|---|---|---|
| ప్రోటీను | 2 | గ్రాములు. |
| కొవ్వు పదార్థాలు | ·1 | " |
| కార్బోహైడ్రేటు | 22·0 | |
| కేల్షియం | 3 | మిల్లి. గ్రా. |
| భాస్వరం | 3 | " |
| ఇనుము | ·3 | |
| విటమిన్ ఎ | శూన్యం | |
| విటమిన్ బి 1 | 6 | యూనిట్లు |
| నికోటెనిక్ ఏసిడ్ | 3 | మిల్లి. గ్రా. |
| విటమిన్ బి 2 | 23 | మిల్లి. గ్రా. |
| విటమిన్ సి. | శూన్యం | |
| కేలరీ విలువ | 99 | |

## మిల్లులోతయారైన ఉప్పుడు బియ్యం:

| | | |
|---|---|---|
| ప్రోటీను | 1.8 | గ్రాములు. |
| కొవ్వు | ·1 | " |
| కార్బోహైడ్రేటు | 22 | " |
| కేల్షియం | 3 | మిల్లి గ్రా. |
| ఫాస్వరస్ | 40 | మిల్లి గ్రా. |
| ఇనుము | ·6 | మిల్లి గ్రా. |
| విటమిన్ ఎ | శూన్యం | |
| విటమిన్ బి 1 | 6 | యూనిట్లు |
| నికోటెనిక్ ఏసిడ్ | ·3 | మిల్లి గ్రా. |
| విటమిన్ బి 2 | 23 | మిల్లి గ్రా. |
| విటమిన్ సి | శూన్యం | |
| కేలరీవిలువ | 99 | |

గోధుమపిండి. ప్రతిఔన్సుకు.

| | | | |
|---|---|---|---|
| (1) | ప్రోటీను | 3.4 | గ్రాములు |
| (2) | కొవ్వు | .5 | " |
| (3) | పిండిపదార్థము | 20.5 | " |
| (4) | కేల్షియం | 11 | మి. గ్రా |
| (5) | భాస్వరం | 91 | " |
| (6) | ఇనుం | 2.0 | " |
| (7) | విటమిన్ ఎ | శూన్యం | |
| (8) | విటమిన్ బి 1 | " | |
| (9) | నికొటెనిక్ ఏసిడ్ | " | |
| (10) | విటమిన్ బి 2 | " | |
| (11) | విటమిన్ 'సి' | " | |
| (12) | కేలరీవిలువ | 100 | |

పై సంఖ్యలను పరిశీలిస్తే మరబియ్యానికీ, దంపుడు బియ్యానికీ, గోధుమపిండికీ మధ్య కొంపలు

ఇంతేకాదు; గోధుమలు పిండిచేసి చపాతీగానో పూరిగానో, జావగానో తీసుకున్నప్పుడు బాగా జీర్ణం అవుతుంది. గోధుమ నూకలతో అన్నం వండి తిన్నవారు మర్నాడు తమ విరేచనం పరీక్షించు కుంటే, తిన్న అన్నం అల్లాగే క్రిందికి పోవడం గమనించగలరు. గోధుమపిండి రసాయనిక నిర్మితికీ గోధుమగింజ రసాయనిక నిర్మితికీ అందులో వుండే వస్తువు పరిమాణాలకు చాలా వ్యత్యాసం ఉన్నది. ఇంతేకాదు; ఈ పరిమాణాలు, భూమిని బట్టీ, వేసే ఎరువునుబట్టీ మారుతూ ఉంటవి. ఈ ధర్మమే అన్ని ఆహారపదార్థములకూ అన్వయిస్తుంది. పైన వివరించిన సంఖ్యలు దక్షిణ భారత దేశంలో లభించే వస్తువులను వికల్పం (Analysis) చేయగా వచ్చినవి. ఏ పదార్థమునూ నైసర్గిక స్థితిలో ఆహారంగా తీసుకోడం సాధ్యంకాదు. జీర్ణం కావడానికీ, ఏదో రకమయిన పక్వవిధానమును అవలంబించవలసి వుంటుంది. అపక్వాహారం, ఒక రకమయిన జీవిత విధానం కలవారికే సాధ్యం.

జీర్ణాశయ వ్రణములలో, ఇచ్చే ఆహారం, 'కిట్ట' పదార్థము లేనిదిగానూ పీచుపదార్థం లేనిదిగానూ ఉండాలి. అయినా కావలసిన శక్తినీ లవణములనూ విటమిన్లనూ ఇచ్చేదిగా ఉండాలి. రోగి, ఆర్థిక సాంఘిక పరిస్థితులకు అనుకూలంగా ఉండేదిగానూ ఉండాలి. ఈ విషయములు దృష్టితో ఉంచు కుంటే, జీర్ణాశయ వ్రణములు తీవ్రస్థితిలో ఉన్నప్పుడు : కొన్ని ఆహార పదార్థములను మాత్రమే వినియోగించడానికి వీలుంటుంది. పాలూ, పాలనుండి తయారయిన కొన్ని వస్తువులూ చాలా ఉపయోగకరములు, కొన్ని కూరగాయలూ పళ్ళూ ఉపయోగకరములు. ఆహార పట్టీని సాంప్రదాయకంగా వచ్చే ఆహార విధానం జీర్ణాశయ వ్రణములలో వాటి దశలనుబట్టి మార్చవలసి వస్తుంది. తీవ్రదశ దాటిన తరువాత రెండవ దశలో ఆహార విధానములలో ఉండే మార్పును వేరే చర్చిస్తాను. ★

# పొట్టికథలు

### కా కా

ఒక చిత్ర నిర్మాత తన పథకాన్ని గూర్చి ఒకరికి పదిమంది ఎదుట గొప్పగా చెప్తున్నాడు. ఆయన సహాయకుడు అమాంతం ఓసారి లేచి వాకిట్లోకి వెళ్ళొచ్చి, "మీ పథకం చాలా బ్రహ్మాండంగా ఉందండీ" అని అరిచాడు. చిత్రనిర్మాతతో సహా అందరూ దిమ్మరపోయారు.

కొంత సేపటికి చిత్ర నిర్మాత తేరుకుని, "నాయనా! రామూ, నీకు పుణ్యం ఉంటుంది నేను మాట్లాడేటప్పుడు నువ్వు కాస్త నోరు మూసుకో" అన్నాడు.

### సంక్రాంతి బట్టలు

పంతులుగారు : ఏమోయ్! రేపు సంవత్సరాదికి మా పిల్లల బట్టలు కుట్టడం అవుతుందా?

టైలరు : సంవత్సరాదికి కుట్టమని మీరు బట్టలేవీ ఇవ్వలేదే!

పంతులుగారు : అదేనోయ్! మొన్న సంక్రాంతికి కుట్టమని ఇచ్చినవే...

కె. రంగారావు.

### సాక్షికి తికమక

ఒక టాక్సీ-డ్రయివర్ తన బండికి ఒకవైపు ఎరుపూ, మరొకవైపు నీలమూ రంగులు వేశాడు. అతని స్నేహితుడు ఎందుకని అడిగాడు.

"ఏక్సిడెంట్ అయినప్పుడు సాక్షుల తికమకలు చూడాలి!" అన్నాడు మొదటి టాక్సీ డ్రయివర్.

కె. వి. ఎస్. (చీరాల)




**Edited, Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press 6 & 7, Thambuchetty Street Madras-1. Chief Editor: S. Sambhu Prasad.**

**Regd No. 4479 ANDHRA SACHITRA VARA PATRIKA.**